# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పీఠిక

భక్తాగ్రేసరులారా !

ఈ గ్రంథకర్తగారు నాకు గురువరేణ్యులును, భక్తి, జ్ఞాన, వైరాగ్యాది సాధనసంపన్నులును, అనుభవ వేదాంతప్రదర్శకులును అగు రాజయోగి శ్రీ పెదపోలు శేషయ్యాబాబాగారు రచించిన యీ విష్ణుభక్తానంద దివ్య యోగమహిమ అను యీ గ్రంథము ఆస్తికులకు చాల ఉపయోగకారిగా నుండ గలదు. ఏలనన పండిత పామర స్త్రీ, పురుషాదులకును ముఖ్యముగా అభ్యాసకు లందరికిని సుబోధకమగునట్లు సామాన్యభాషలో వచనరూపమున వ్రాసి యున్నారు. విష్ణువు సత్వగుణప్రధానుడు గనుక సత్వగుణ ప్రధానులకు ఆనందమును దివ్యమైన యోగమహత్తులను తెలియజేయుచున్నందున యీ గ్రంథమునకు యీ పేరెంతయు తగియున్నది.

వీరికి నడివయస్సునందే ఇంద్రియనిగ్రహత్వము, చిత్తైకాగ్రత, వాయునిరోధము, ఊర్ధ్వదృష్టి సూక్ష్మదృష్టి మొదలైన గుణాతీతలక్షణములు గలుగుటచేతను, చిన్నతనమందే భగవంతునిలీలలు వీరికి దృశ్యమగుటచేతను, వీరిని మఱింత గాఢమైన విజ్ఞానవంతునిగా చేసెను. వీరు పరమసాధువులును పండితోత్తములునుఅయిలోకమునకుతరుణోపాయమునుప్రసాదించుచున్నారు.

పశు పక్ష్యాదులయొక్క చర్మము, రక్తమాంసాదులు ఉపయోగపడు చున్నవి. మనుష్య శరీరమునందుండునవి ఏకికిని పనికిరావుగదా !

శ్లో॥ ఆహార నిద్రాభయ మైధునాని । సామాన్యమేతత్పశుభిర్నరాణాం।
జ్ఞానంహి తేషామధికోవిశేషః । జ్ఞానేనహీనః పశుభిస్సమానః ।

అను నార్యోక్తిననుసరించి మానవునకు జ్ఞానముండుటచేత అధిక్యతను కలిగియున్నాడు.

మానవులందరు దుఃఖనివృత్తిని, సుఖప్రాప్తిని కోరుదురుగదా ? కస్తూరిమృగము తన నాభియందున్న కస్తూరిచే యీ ప్రదేశమంతయు పరిమళ ముగ నున్నదని గ్రహించలేక సుగంధముకొరకు అడవియంతయు పరుగెత్తును. అవ్విధంబున మానవుడు తాను సుఖరూపాత్మయని తెలిసికొనక సుఖముకొరకు శ్రమపడుచున్నాడు. జిజ్ఞాసులైనవారికి దీనియందు దగిన అభ్యాసములు, అనుభవ విషయములుగలవు. వానివలన దుఃఖనివృత్తియు, సుఖ ప్రాప్తియు, మోక్షము గలుగగలదు.

ఈ గ్రంథము భక్త బృందముయొక్క సహాయ్యముచే సిద్ధపరుపబడినది. ఇందు కర్మోపాసనాజ్ఞానములని త్రివిధభేదములును అనేకోపభేదములును నిందు పొందుపరచియున్నారు. మరియు నిది నితర వేదాంతగ్రంథములకంటె సులభశైలిలో నుండుటచేతను అభ్యాసములు అందరికి తెలియునట్లు ఆయా అభ్యాసములు చేయు పద్ధతులు వ్రాసియుండుటచేతను, ఆచరణీయముగ నిర్దుష్టముగనుండి విశిష్టత గలిగియున్నది.

ఇందుగల విషయములు అనగా కార్యకారణరూపములును, భక్తి, జ్ఞాన వైరాగ్యసాధనములును, ఇంద్రియముల వృత్తులును, మహాత్తులు, నిష్టలు, నియమములును, సుషుప్తి సమాధుల లక్షణములును, యోగ సాధనములును, సగుణ నిర్గుణోపాసన క్రమములున్ను, కర్తృత్వ భోక్తృత్వములును, అణిమాది సిద్ధులును, ప్రాణాయామవిధానం, హంసజపం, స్వరూపస్థితి లక్షణములును మొదలగు పెక్కు విషయములెన్నియో నిందు పొందుపరచబడి యున్నవి. గనుక గ్రంథకర్తగారి శక్తిసామర్థ్యములను సాధకులు గ్రహింపనగును. ఈ గ్రంథము సర్వవిధముల స్తుత్యర్హమైనదని చెప్పుచున్నాను. మరియు జిజ్ఞాసులు పఠించుకొనుటకు నిందు గురుప్రార్థన, విజ్ఞాననౌక, విష్ణు పంచాయుధస్తోత్రం. పాదుకాస్తవము వగైరా శ్లోకములునిందు వ్రాయబడినవి.

"స్వయంతీర్ణః పరాంతారయతి" అను నార్యోక్తిననుసరించి ఆధ్యాత్మిక విషయములు అభ్యాసములు బోధించుటలో లోకముమీదగల యితర గురువుల కున్ను వీరికిన్ని చాల వ్యత్యాసముగలదు. అనగా అభ్యాసములు వీరు చక్కగా చేసి చూపించి తిరిగి సులభరూపమున భక్తులచే చేయించుటలోను, వీరిని బంధ వలలోను వీరికిగల సామర్థ్యము చాల కొనియాడదగినది.

దీనికంతకుమూలము వారి యర్థాంగి. ఆ రాజామణమ్మగారి ప్రేమ శ్రద్ధాసక్తులే ముఖ్య కారణములు. మోక్షార్థులై వారి గృహమునకేతెంచినవారిని జాతి, మత భేదములు పాటించక ఆమె చాలయాదరించుచూ వారికి అభ్యాసములు, బోధనలు యవలీలగాచేసి స్వరూపానుసంధానం వారిచే చేయించుటలో సమర్థురాలుగానుండుటయే వీరి నిరంతరాధ్యాత్మికకృషికి దోహదమగుచుండెను

వీరి భక్తమండలి తరించుటకు ఇంకను కొంతకాలము వీరు ఆయురారోగ్యాభివృద్ధిగా నుండునట్లు ఆ త్రిగుణాతీతుడు అనుగ్రహించుగాక.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

కైకరం
3-12-1955

ఇట్లు విబుధ విధేయుడు,
మునుకుట్ల సూర్యనారాయణ.

ఓం

# విష్ణుభక్తానంద దివ్యయోగ మహిమ

దేవుడు = సాకార, నిరాకారములుగా నుండును. సాకారము ఎల్లప్పుడు మారుచుండు, రూప, నామాదులు గలదిగా నుండును. నిరాకారమునకు నామరూపాదులు లేవు. గనుక మార్పు లేదు.

| సాకారము. | నిరాకారము. |
|---|---|
| 1 ఆయాపనులు, నెరవేర్చుకొనుటకు వీలైన, నామ రూపాదులతో పుట్టినది. | 1 ఏక్రియలు లేనప్పుడుండు స్థితి |
| 2 పనికాగానే అంతరించునది | 2 పనితీరినను అంతరించనిది |
| 3 మనవలెనే చేష్టలు కలది | 3 చేష్టలు లేనిది |
| 4 శక్తులు విజృంభించుచు, సంకోచించుచు, స్థితి, స్థాపకశక్తికలది. | 4 స్థితి స్థాపకములు లేక నిరంతరం ఒకేవిధమైన శక్తికలది |
| 5 కార్యరూపములో వ్యక్తముగను కారణరూపములో అవ్యక్తముగ నుండు రూపాదులుగలది | 5 కార్యకారణములలో వ్యక్తావ్యక్తములు లేనిది |
| 6 ప్రపంచములోని శక్తులన్నియు, సాకారరూపములుగలది | 6 ప్రపంచికము లేనప్పుడున్ను, వున్నప్పుడున్ను నిర్వికారముగానుండునది. |
| 7 ఐచ్ఛిక భావనరూపములుగలది | 7 యిష్టానుసారమూ భావించుటకు వీలులేనిది |
| 8 ఖండాకారములుగలది | 8 అఖండాకారము గలది |
| 9 ప్రపంచాకృతితో ఇంద్రియగోచరము గలది | 9 ఇంద్రియ గోచరముకాని ప్రపంచాకృతి స్వరూపముగలది |

| | |
|---|---|
| 10 బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల యొక్క భావనారూపములుగలిగి ఆభావనారూపములక్రియలుగలది | 10 భావనారూపముల ధారణపోయిన తర్వాత, మిగిలిన రూపముగలది |

పైచెప్పిన విధముగా సాకార నిరాకారములున్నవి.

2. పుణ్యము : తనకు, యితరులకు సుఖము కలిగే నిమిత్తం చేయు పనులు లేక తనయొక్కయు, భగవంతుని యొక్కయు, స్వరూప, స్వభావాదుల, దర్శనానుభవాదులకు చేయు పనులున్నూ, జ్ఞానానుభవముతో కూడి చేసిన పనులు, జ్ఞానానుభవవృత్తికి సహాయముచేయు పనులున్నూ, పుణ్య కర్మలని పేరు.

పాపము : ఆయాపనులుచేయు కాలము తనకుగాని, యితరులకుగాని, కష్టముగానుండుచు, నిజవస్తు దర్శనానుభవము కలుగుటకు, ఆటంకములుకలిగించుచూ, మనోలయాదులు లేక, అహంకార, మమకారాద్యభిమానోద్రేకాదులతో, సంగుడై చేయుపనులను పాపకర్మలు అందురు.

3 కర్మ : మంచివారికిచేయు, సర్వేంద్రియాదులతో ఆచరించుపనులున్నూ, ఇంద్రియ నిగ్రహాదులకుచేయు పనుల కున్నూ, కర్మలందురు.

వికర్మ : దుర్మార్గులకు, మంచివారికి, తనకు, కష్ట నష్టములుకలిగించుచూ, విషయలోలత్వమును పురిగొల్పుపను లున్నూ, బంధసహితత్వముగా చేయు పనులు వికర్మలందురు.

అకర్మ : తనస్వరూపానుభవముతో, కామక్రోధాద్యభి మానోద్రేకాదులు లేక, నిర్లిప్తుడై, అసంగుడై చేయు పనులు అకర్మ లందురు.

4. <u>సృష్టిస్థితి, లయములు</u> : మనకు, కన్పించునామ రూపాదులు లేనప్పుడు ఒక్క పరమాత్మయే యుండెను. ఆపరమాత్మలో యీనామ రూపాదులు కలుగ జేయు సత్తా యిమిడియుండెను. ఆసత్తాతో కూడిన పరమాత్మ క్రమముగా యీ రూపములు దాల్చుటే సృష్టి అందురు. ఆ పరమాత్మయందు సృష్టిస్థితి లయములు జరుగుచున్నట్లు తోచుటే గాని, నిత్యములు గావు. అనగా ఎల్లప్పుడు ఒకే రూపములుగావుండునవి కావు. కలలు గనుచున్నప్పుడు ఆసమయములో కలిగే అనుభవములు నిజముగా జరుగుచున్నట్లు కనిపించి, మెలకువరాగానే అవి అన్ని అబద్ధమైనట్లు తెలియును. జాగ్రిత్స్వప్నములు, సుషుప్తి కాలములో, అబద్ధమైనట్లు, జ్ఞానానుభవకాలములో, జాగ్రిత్స్వప్న సుషుప్తులు, అబద్ధమువలె తోచు చుండును. స్థిరముగా, సృష్టించిన వస్తువులను, నిలుపుటకు, ఆపరమాత్మలోనున్న శక్తికి లేకపోయెను. గాని, సూక్ష్మరూపములో, స్థూలరూపము లన్నియు, స్థిరముగా నుండునట్లు మాత్రము ఆ శక్తికి కలిగి యుండెను. స్థూలరూపములు మారి, సూక్ష్మరూపమును పొందుటను. మాత్రమేగాని,అసలుమూలపదార్థములు నశించవు స్థూలమును విడిచి సూక్ష్మరూపమును పొందుట, సూక్ష్మరూపము స్థూలరూపము దాల్చుట, యిదియే, సృష్టిస్థితి, లయము లనబడును. ఆపరమాత్మయందు, సృష్టిస్థితిలయములు, ఎన్నడూ జరుగుట లేదనే వాదము నమ్మతగ్గదికాదు. నామరూపక్రియలు మాత్రం నిత్యములుకావని, పదార్థము నిత్యమని నమ్మవలెను. శక్తికి పరమాత్మకు భేదములేదు ఆశక్తి, స్థూల రూపములుగా

మారి నప్పుడు ప్రకృతిఅని, సూక్ష్మరూపములో నున్నప్పుడు, పరమాత్మను శక్తిని విడదీయని స్థితిలో నున్నప్పుడు పరబ్రహ్మ స్వరూపమని వ్యవహరించెదరు. సూక్ష్మరూపములో నున్న ప్పుడు, కారణరూపమని, స్థూలరూపములో నున్నప్పుడు కార్యరూపమని భావించుటేగాని, కార్య, కారణములకు భేదము, తాత్కాలికమేగాని, ఒక టేఅయివుండును. గనుక, పరమాత్మ సృష్టి, స్థితి, లయాకారములతో కన్పించుట సాకారబ్రహ్మ మని, అవి లేకుండునప్పుడు, నిరాకార నిర్గుణ, నిత్య, శుద్ధబ్రహ్మ మని చెప్పబడును. కార్య కారణములుగా మారినశక్తి పర మాత్మ శక్తియేగనుక, సృష్టి స్థితి, లయములు పరమాత్మ స్వరూపమందేవున్నవి గనుక అన్యవస్తువులేదుగనుక, అద్వైత మనిరి.

5. బ్రహ్మ, విష్ణు, రుద్రస్వరూపములు : ఇవి ఒక విధమైన శక్తులే, సమష్టి, వ్యష్టి రూపభేదములచేత ఆయాశక్తులు అనగా, సృష్టిచేసే శక్తినే, బ్రహ్మమని పెంపుచేయు శక్తినే, విష్ణువని, నామరూపక్రియాదులను మార్పుచేయు శక్తినే రుద్రుడని పేర్లు. ఆయారూపములు కావలెనన్నప్పుడు, ఆయాగుణములు. ప్రధానము గావుండును. పెంపుచేయుశక్తికే విష్ణువని, పుట్టించుశక్తికే బ్రహ్మ అని, లయింపచేయు శక్తికే రుద్రుడనిపేర్లు. ఆయాశక్తులను వుపాసించు భక్తులనిమిత్తం,యింద్రియమనంబులు నిగ్రహాదులు లేని మానవులకు నిగ్రహం నిమిత్తం ఆయాశక్తులకు, రూప, నామక్రియాదులుకల్పించి,సులభముగా భక్తులకు,నిర్మలేంద్రియ నిగ్రహాదులు కలుగుటకు, కొన్నికథలు, స్థానములు, రూప ములు, మహాత్మ్యలు, వ్రతములు, నిష్ఠలు, నియామకములు

మహానీయులు, కల్పించి వ్రాసినవేగాని, నిజములుకావు గదా శక్తికి స్త్రీ స్వరూపమనికూడా ఆయాపురాణములలో అభిప్రాయపడేటట్లుకూడా కల్పించినారు నిజముగా శక్తి స్త్రీకాదు, పురుషుడుకాదు, నపుంసకముకాదు, పరమాత్మకువున్న లక్షణములే శక్తికికూడాకలవు. గాని ఏ అణుమాత్రమున్నూ భేదము లేదు. భేదమును కల్పించుటకు సహాయపడేదేశక్తి అట్టిశక్తి లేకపోతే, ఆ ఒక్క పరమాత్మ, యేదియూకూడా, సృష్టించనేలేదు. ఎందువల్ల? అది నిర్వికారము, గనుక, వికారములకు ఆధారభూతమైనశక్తివల్ల వికారరహితత్వముకలుగదు. ఓభక్తులారా, శక్తిని తుచ్ఛస్త్రీకి పోల్పకూడదు.

అజ్ఞానమంతకు ఆధారభూతురాలు దానికిపోల్పరాదు. ఆశక్తి నిర్మలాంతఃకరణమును ప్రసాదించి ముక్తినిచ్చు స్వరూప స్వభావాదులుకలది. ఇవే పురాణములు. వాట్లవల్ల పైన వ్రాసినఫలము ఎప్పుడైనా ఎవరైనాపొందిరో లేదో తెలియదు. యిప్పటికి ఆ ఫలములు వచ్చుటలేదు. ఎందువల్లననగా, విష్ణుపురాణములో, విష్ణువుమీద యెటువంటి అవినీతిపనులు చేసినట్లు వ్రాయబడియున్నవో చూడుడి. బృంద, అనసూర్య మొదలైన మహా పతివ్రతలను పతివ్రతాభంగమునకు చేసిన పనులు, శివపురాణములో, విష్ణు మోహినీ రూపములోనున్నప్పుడు, కామముచేత చేసిన పనులు, బ్రహ్మపురాణములో, బ్రహ్మ, తన కూతురుతో రమించినట్లు మొదలైన కథలు వినువార్లు, ఎట్లు పై ఫలములను పురాణములవల్ల పొందగలరు. గ్రంథవిస్తర. భీతిచే యిట్టి సంగతులు వ్రాయుట మానితిని. కల్పిత నామరూప క్రియాదులేగాని, ఆపురాణగాథలు నిజమని

నమ్మరాదు. నమ్మి ఆ విగ్రహాలను బాహ్యాభక్తితో పూజాదులచే సంతుష్టి చెందువారలు, అవివేకులే యగుదురు. అనగా శివ, కేశవాదులను భేదబుద్ధితో చూచుట. కామ క్రోధాదులతో మత్తోద్రేకాదులను వృద్ధిచేసి, యింద్రియలోలులుగాచేసి స్వస్వరూపనిష్ఠలో ప్రతిష్టింపబడరని అభిప్రాయముగాని సరియైన అనుభవనీయులగు గురుసాంప్రదాయకమైనయడల, ఆ పురాణములయొక్క, వుద్దేశము, నీతి, విగ్రహోపాసనా వుద్దేశమును బాగుగ అనుభవమును తెలిపి, వుత్తీర్ణులుగా చేయగలరు. బ్రహ్మావిష్ణు మహేశ్వరాదులు, ఒకానొక స్థానములో ఒకానొక రూపముతో, కొన్ని కర్తలు, స్థూలశరీరములతో, మానవాకృతిగనో, పశుపక్షి, క్రిమి కీటకాది శరీరములతో, కూడియున్నారనే వుద్దేశముతో నమ్మి భక్త్యాది సాధనలు చేయువారలు వుత్తీర్ణులు గాకపోగా అజ్ఞానాంధకారమగ్నులగుదురు. వారిమీద కథలు ఎంతనీచములుగా, యెంతఅసహ్యముగా వ్రాయబడెనో మానవత్వమున్న ప్రతివారికి తెలియును. గొప్ప శక్తిస్వరూపులైనవారిమీద ఆరోపణకథలు వ్రాసిరి. మనకు కొన్నినీతులు, భక్తి, జ్ఞాన, వైరాగ్యాది సాధనలు బోధించునిమిత్తమై, కథలుగాకల్పించివ్రాసిన, సులభముగా అజ్ఞానులకు బోధపడునని వ్రాసిరి. ప్రతిపురాణ కథలవల్లను, మనము ఏనీతి నేర్చుకొనవలెనో ఆనీతిని మనము ఆచరించి దానిఫలము పొందినయడల క్రమక్రమముగా. కృతకృత్యులమగుటకు సందేహములేదు.

6. <u>దేవతలు</u> : ఇవికూడా కొన్నిశక్తులే. ప్రతిఅణువు యందు ఏదో ఒకానొకశక్తి యుండనేయున్నది. మనము, విను

గలశక్తి, చూచుశక్తి, ఆలోచించుశక్తి, మొదలైనవన్నియూ, ఆ దేవతలే. అట్టివాటికన్నిటికి, ఏవో కొన్నిరూపాదులుకల్పించి, స్థూలేంద్రియములకు గోచరించునట్లు, ఆకార కర్మాదులు కల్పించి, కొన్ని కథలుగను, భీకరకర్మలు చేసినట్లును, అనేక రకములుగా, కల్పించిరి. కొన్ని దేవతలకు ఆడరూపు, మగ రూపులు పశు పక్ష్యాదిరూపములు, నిర్మించి వాట్లకు మద్య మాంసాదులు ప్రీతిఅని వ్రాసిరి. ఇవి అజ్ఞానులను మరింత అవివేకులుగావించి, అస్థాయి, దుఃఖభాజనులుగను. ఇష్టకామ్యార్థ సిద్ధులుకలిగించెదరను భ్రాంతిని అభివృద్ధిచేయును. గాని అవి నిజముకాదు. శక్తి వుపాసనాకాండప్రకారం చేయనివారలకు శక్తి ప్రత్యక్షముకాదుగనుక, యేహ్యములైన పనులుచేయుటకు ప్రోత్సాహపెట్టుదురు. గాని, నిజమేమనగా! సత్వగుణమువల్ల కాతగినపనులు సిద్ధించునిమిత్తం, సత్వ గుణాకర్షణగల నామ రూప క్రియాదులుగల ఆకారములను వుపాసించవలెను. భక్తి, జ్ఞాన వైరాగ్యములు, చిత్తైకాగ్రత, ఇంద్రియ నిగ్రహము, ముక్తి, కొన్ని ఇహలోకకార్యసిద్ధులు కోరినవారు సత్వగుణ ప్రధానముగల రూప, నామ క్రియాదులను, ధారణాదులుచేసి, సంకల్పించగా తనశక్తియే, ఆయా సిద్ధులనుయిచ్చును. రజోగుణ మువల్ల కాతగినపనులు సిద్ధించునిమిత్తం, రజో గుణాకర్షణగల, నామరూప క్రియాదులుగల ఆకారములను ఉపాసించవలెను. అనగా, అన్యాయ వ్యాజ్యములు గెలుచుటకు, దొంగతనము, వ్యభిచారము మొదలైనపనులు సిద్ధించునిమిత్తం, యుద్ధములో గెలుపు రాజ్యభోగములకొరకు, ఇంద్రియ, దుర్విషయముల అనుభవమునిమిత్తం, అనగా దుష్కార్యముల సిద్ధినిమిత్తం,

రజోగుణప్రధానముగల, భీకరాద్యాకారాదులుగల, రూపనామ క్రియాదులుగల ఆకారములను, ధారణాదులు చేసి, సంకల్పించగా, తనశక్తియే ఆయాసిద్ధులను యిచ్చును. అట్లే తమోగుణ కార్యసిద్ధులకున్నూ గ్రహించునది. శక్తిఉపాసన చేయువిధానము పై విధముగా చేయుటకు, అనేక కల్పితపురాణములు వ్రాసిరి.

7. <u>దయ్యములు</u> : ఇప్పటికాలములో, దయ్యమనగా, నల్లగనో తెల్లగనో జడలు విరబోసుకొనో అనేకవికారస్వరూపములతో, మానవాద్యాకారములతో, కన్పించి అంతలో లేకపోయేవాటిని దయ్యములనుచున్నారు. అదికాదు. అతి దురాత్ములు ఏవిషయముమీదనైనా వ్యామోహాదులు కలిగి రాగద్వేషములతో చనిపోయినచో, వారిసూక్ష్మశరీరముఆయా వస్తువులచుట్టు తిరుగుచుండును. ఆ వస్తువుకు రాగద్వేషాదులు లేకపోతే ఏబాధయూలేదు. (ఉ) ధనము, యిల్లు, భార్య, పశుపక్ష్యాదులమీద, ఒకానొకనికి మోహాదులువుండి చనిపోయె ఆతని సూక్ష్మశరీరము, పై వస్తువులచుట్టు తిరుగుచు, ఆయాపదార్థములను అనుభవించువారలకు కన్పించుచూ బాధపెట్టును. గాని సద్గుణసంపదగలిగి, భక్తి జ్ఞాన వైరాగ్యసాధనలతో యున్నవారు అనుభవించినన్నూ, వారలను ఏమీ చేయలేదు. కన్పించనైనా కన్పించదు. స్థూలశరీరము లేదుగాన, స్థూలాకృతితో కన్పించెననుట అబద్ధము, భ్రమ కల్పితము వ్యామోహములతో ఆయా వస్తువులను అనుభవించువారలకు చెడువృత్తులకు ప్రోత్సాహపెట్టును. కొన్ని వ్యాధులుకలిగే పనులు చేయ ప్రోత్సాహించును. వృత్తినిగ్రహమువల్ల అవితొలగును.

భయకంపాది దుర్గుణములవల్ల అట్టి రూపములుతోచును గాని నిజముగావున్నవికావు. దయ్యములయ్యే సూక్ష్మశరీరములు సామాన్యమోహాదులవల్ల కలుగవు. అపరిమితములైన మోహాదులవల్ల అట్టివిఅగును. అట్లయ్యును, దుర్విషయలోలత్వము కలిగిన భ్రమాదులున్నవారినిమాత్రమే బాధించును. అంతఃకరణయందు దుర్విషయములుంచుకొని పైకిమాత్రం సన్మార్గులవలె వేషధారులకును అవి బాధింపచేయును. ప్రతి నిమిషము ఒక దుర్విషయమును తలంచుచుండెడివారలు అట్టి రూపములు పొంది, రాగ ద్వేష వస్తువులనుచుట్టుకొని వాటికి వృత్తి విశేషములవల్ల దుఃఖము కలుగజేయును. ఏవస్తువులను ద్వేషింపరాదు. మనముతలంచు ప్రతిరూపము సూక్ష్మాకాశములో బొమ్మలుఏర్పడును. ఎన్ని పర్యాయములు మానసేంద్రియములతో ఎటువంటిరూపమును తలంచెదమో, అటువంటిరూపములు మనసులో ఏర్పడియుండును. ఆ రూపములు పదేపదే జ్ఞప్తికి వచ్చుచుండును. కను మూసినా కను తెరచినా అవే కనబడును. ఆపను లేచేయ బుద్ధిపుట్టును. ఇవే దయ్యముల బాధలుగా మారును గనుక ఆభావనలకు వ్యతిరేకరూపములు తలంచినకొలది మొదటి రూపములునశించి, సద్రూపము లేర్పడును. ఇట్లు చేయలేనివారలు పెద్దలుఅనగా అనుభవనీయులైన మహానీయులవద్ద, వారి ఆజ్ఞానుసారం చేసినయడల, పూర్వపురూపములు నశించి, మంచి తలంపులు కలిగించు ఆకారములు మనసున ఏర్పడుటే ఫలము ఆపెద్దలు చెప్పినట్లు చేయ లేకపోయినయెడల, ఫలము పొందలేరు. గనుక ప్రతిమానవుడు, అనుభవనీయులైన పెద్దల దగ్గర, బాధలుకలుగక పూర్వమే చేరి, మానసేంద్రియములకు,

మంచిరూపములు, సూక్ష్మాకాశములో, అనేకము లేర్పడునట్లు, పదేపదే తలంచి, తలంచి, సుఖదాయకములైన, జీవితములను సంపాదించుటే, వాట్లబాధలు తప్పుకొనువుపాయము. ఇదియూ సంపాదించ లేనివారలు, భూతవైద్యులవల్ల, మంత్ర, యంత్ర, తంత్రాదులచే, పోగొట్టుకొన ప్రయత్నించ వలెను. వీరికయ్యే, అనగా అజ్ఞానాంధకారులకే, మంత్రశాస్త్రాదులు కల్పించి, అనేక ఆర్భాటములు, ఆభూతవైద్యులవల్ల పొంది అనేక కష్టనష్ట ములపాలై తుదకు మనస్సుకు ఒకవిధమైన నమ్మకము కుదరగా పోవునని నమ్మికకలుగును. అట్టి నమ్మకము ఏవిధముగా సంపా దించినను దయ్యములు వదలినట్లే తృప్తికలుగును. ఇదియే సత్యము. దీనిలోని భావమునుగ్రహించి, వారికివారే చేసుకొని ఫలమును పొందవచ్చును.

8. రాక్షసులు : దుర్విషయ వ్యాపారములనుచేయ ప్రోత్సాహపెట్టువారున్నూ, సూక్ష్మవృత్తులనున్నూ, వికార రూపక్రియాదులను చేయువారలనున్నూ, భీకరాకారములు భయంకరకృత్యములను చేయువారలే రాక్షసులు. పూర్వకాల ములోను, యిప్పటికాలములోను, యీదుర్మార్గులవల్ల అనేక బాధలుకలిగి అనుభవించుచున్నాము. ఇట్టివారిని సంహారించిన వారినే దేవతలని, అవతారములని, మహాత్ములని పురాణాదు లలో వింటున్నాము. ఇక్కాలములో చూచుచున్నాము.

9. వర్ణాశ్రమాచారములు : 1 సమత్వబుద్ధిని కలుగ చేయుటకు ఆచరెంపవలసిన కార్యములు. 2 తనయొక్క చిత్తేం ద్రియ వ్యాపారాదులలో శాంతమును పురికొల్పచేయు కర్త

ములున్నూ, 3 కామ క్రోధాది ఆవేశరహితత్వమును పోత్సాహపెట్టు గుణములుకలిగిన పనులున్నూ, 4 ఆయు రారోగ్యములు కలుగచేయు ఆచారములున్నూ, యీ 4 ఫలములు కలిగించు బాహ్యేంద్రియ వ్యాపారములు వర్ణాశ్రమాచారములనవలెను. గాని దురభిమానగ్రస్తులగను, వేష భాషలలో కామక్రోధాది దురహంకార గ్రస్తులుగను, దుఃఖ భాజనులుగను అనారోగ్య వంతులుగను, మొదలైన బంధములను కలుగచేయునది ఏవర్ణమైనా, ఏ ఆశ్రమమైనా, ఏ ఆచారమునైనా, విడువవలెను. పై చెప్పిన సద్గుణసంపదను కలుగచేయు ఏవర్ణాశ్రమ ధర్మములనైనా ఆచరించదగును. భక్తి జ్ఞాన వైరాగ్యాది సాధనలవల్ల మోక్షము పొందుటకు స్త్రీ పురుషులకు అందరకుహక్కుగలదు. ప్రాపంచిక వ్యాపారములు చేసి ఇహసౌఖ్యముల కొరకు ఒక్కొక్క పనికి ఒక్కొక్క కులము, ఆశ్రమము ఆచారములు ఏర్పాట్లు చేసియున్నారు. అట్లే తప్పుపనులకుకూడా అనగా కల్లుత్రాగుట, మాంసభక్షణ, వ్యభిచారములు మొదలైన పనులుచేయుటకున్నూ వర్ణాదులు ఏర్పరచిరి. అవి ఎంత అనాగరికతో బుద్ధిగలవారు విచారించిన తమకే తెలియును. అదృష్ట కార్యములు ఆయా వర్ణములవారు చేసినచో తప్పులేదని యిప్పటికి వాడుచున్నారుగదా! అందుకనే యిప్పటి వర్ణాశ్రమాచారములు యిక్కాలమునకు హేళన రూపముగా పరిణమించెను. గనుకనే, వాటినిగురించి వ్రాసినయడల దూషణజాస్తి అగునని వదలితిని.

10. <u>తద్దినములు, మొదలైనవి</u>: 1 అపరకర్మలని 2 పర కర్మలని అందుము. అపరకర్మలు, శ్రాద్ధాదులు, పరకర్మలు, ఉప

నయనము, వైవాహాదికర్మలు ఇవియు, వర్ణాశ్రమాచారములు ఎట్లు తారుమారై అవినీతులుగను అజ్ఞానులుగను, కామక్రోధాది ఆవేశపూరితులుగను, భేదబుద్ధులు మొదలైన దుర్గుణోద్రేకులుగను ఫలమునుకలిగించెనో, అట్లే పరాపరకర్మలుకూడా పరిణమించెను. చచ్చిపోయినవారు తద్దినమురోజునవచ్చి ఇక్కడ చేసే, తినే వాటిని వారనుభవించెదరన్న అభిప్రాయము మొన్నటివరకు చాలామందికి అభిప్రాయంతోనే చేయుచూ వచ్చిరి. గాని యీకాలములో ఆ అభిప్రాయము పోవుటచేత చాలమంది తద్దినాదులు మానినట్లగపడుచున్నది. అట్లు బొత్తిగామానుటవల్ల చాల తారుమారుపనులకు అవకాశము కలిగించుచున్నది. గాన శక్తికొలది వాటిని విధిగా చేయుచునేయుండుట తనపురోవృద్ధికి మార్గమగును. అట్లు చేయుటవల్ల ఉపయోగము లెవ్వియన 1 త్యాగము 2 భక్తి 3 సత్వగుణ లక్షణములు అభివృద్ధిఅగుట మొదలైన లక్షణములు కలిగించి పరంపరగా ఉత్తీర్ణత కలుగుటకు సహాయమొనర్చును. చచ్చిపోయినవారు తిని పోదురనే భ్రాంతిపడరాదు. వారిపేరుతో కొన్ని భూతములకు ఆహార పానీయాదులు పెట్టుట తటస్థించును. మంత్ర తంత్రాదులతో యధావిధిగా చేయకపోయినా, ఆరోజున వారిపేరుతో అన్న పానాదులు యితరులకు పెట్టుటే ముఖ్యముగాచేయవలెను.

11. భక్తి: పరమాత్మ స్వరూపమును తెలుసుకొని తదైక్యానుభవమును అనుభవించుటకు చేయు సాధనలమీద వున్న ప్రేమకు భక్తియందురు. ఇది బాహ్యభక్తి 2 అంతర భక్తిఅని 2 విధములు 1 బాహ్యభక్తి అనగా బైటకుకన్పించేలాగున కనుపరచు ప్రేమ అనగా స్నానం, జపం, బొట్టు, విగ్ర

హాములకు ఆరాధన, తీర్థయాత్రలు, గురుసేవ వేదాధ్యయనము మడి ఆచారములు బాహ్యశుచి ఆరోగ్యసాధనలు స్నానం – తెల్లవారుఝామున చన్నీళ్ళస్నానముమంచిది తిరిగి సాయంత్రం చేయవలెను. అరగంటసేపు భగవన్నామోచ్చారణచేయుచూ ప్రతి అంగమును మురికిలేనిగుడ్డతో తోమవలెను. జపం – ఒకే సాకార రూపమునకు తగిన నామమును ఏర్పరచుకొని, ఆసాకార రూపముయొక్క చరిత్రను తెలుసుకొని అనేకసార్లు వుచ్ఛరించుచూవుండుట అనామముగాని ఆరూపముగాని శాంత్యాకృతిగా నుండవలెను. భీకరాకృతిగా నుండరాదు. విగ్రహారాధన = సాత్వికాహారాది సదూపముగలదిగనే యుండవలెను. దానికి పువ్వులు మొదలైన వస్తువులతో అలంక రించి, ధూపదీపనైవేద్యాదులు అర్పించుచుండవలెను. తీర్థ యాత్రలు = తానుయేర్పరుచుకున్న దేవతా సంబంధమైన స్థలములుగల తీర్థయాత్రలకు ముఖ్యముగాపోయి ప్రకృతివిచిత్ర ములను చూచి తెలుసుకొనుట అనుభవనీయులైన పెద్దల దర్శ నము, దేశాచారవ్యవహారాదులు తెలుసుకొనుట, తదితర తీర్థములకుకూడా పోవచ్చునుగాని అక్కడక్కడచేయు బహు విధ కర్మలుమాత్రము చేయకూడదు. గురుసేవ = అనుభవ నీయులు. అనగా చెప్పినవిచేసి చూపగలవారిని సేవించుట. వేదాధ్యయనాదులు = పద్యగద్య, కీర్తన, కథ శ్లోకవాక్యా దులను చదివి ఆనందించుట. మడి = యిప్పుడు అనుకొను చున్నట్లు ఆరవేసిన బట్టలు కట్టినంతమాత్రమున మడికాదు. దానికితోడు మడితోఉన్నంతసేపైనా భగవత్సేవ సంబంధమైన మాటలు, కామ క్రోధాది ఆవేశములు కలుగకుండానైనా వుండ

వలెను. ఆచారములు = సాధ్యమైనంతగా పూర్వాచార ములను వివేకముతో అనగా అందులో మంచివి అనగా సత్వ గుణాభివృద్ధికి కావలసినవి ఏరి ఆచరించుచుండుటే ఆచారములు. బాహ్యశుచి = ఇది మనస్సునకు యింపుగానుండునట్లు గృహా దులను యేర్పరచుకొనుట. ఆరోగ్యసాధనములు = పై విధు లన్నియు యిందుకొరకే ఏర్పరుపబడినవి. గనుక ఆహారపానీయ విహారాదులన్నియు తన శరీరమునకు సరిపడినవానిని మితముగా కాలముమీరక శుచియైన స్థలాదులలో శాంత మనస్కుడై స్వీకరించుచుండవలెను. (2) అంతరభక్తి = ఏకదైవోపాసన వల్ల కామక్రోధాది దుర్గుణములను తొలగించుకొను వుపాయ ములను కలుగచేసుకొని మనోనిగ్రహముతో, అనగా మనస్సు నివృత్తిగా వుండుటకు చేయవలసినయోగాదిసాధనములు చేయు చుండుటే అంతరభక్తి యందురు. ఇది సద్గురు కటాక్షముననే కలుగవలెగాని ఆశాపిశాచాది దుర్గుణములుగల గురువులవల్ల నెరవేరనేరదుగదా! ఇంకా అధోగతికే మార్గమేర్పడును. మంచి అనుభవనీయులైన గురువు దొరకువరకు, బాహ్యభక్తి చేయు చుండుటే మంచిదిగాని త్వరపడి ఏ గురువునుపడితే ఆగురువుల వద్ద వుపదేశాదులు కాకూడదు. గురువునుగురించి వ్రాయుచోట చూతుడు.

12. <u>అజ్ఞానం</u> : తనను, దైవమును, ప్రపంచికమును తెలుసుకొనకుండా ధనకనకవస్తువాహనాదులనుమాత్రం సంపా దించుచూ, వాటిని వృద్ధిచేయు వుపాయములనుమాత్రం నేర్చు కొని ఏవిధముగానైనా వాటిని ఆర్జించుటే ముఖ్యవృత్తి గలిగి

యుండి, సంసార బంధములను కలిగించుకొని ఆబంధములనుంచి విడిపోవు వుపాయములను తెలిసియూ ఆచరించని బ్రతుకు కే అజ్ఞానపు బతుకు. ఇది వస్తుతః ప్రపంచికములో యెన్నటనూ ఏవిధముగాను సృష్టింపబడివుండనిదానినే అజ్ఞానం ఎవరికివారు ఏనిముషమునకు ఆనిమిషం కల్పించుకొంటే కలిగించుచుండును. నిర్ధారణగా నిర్దేశింపబడి సృష్టిలో పుట్టించివుండనిదే అజ్ఞానం.

13. జ్ఞానం : మోక్షకర్మములను చిన్నతనమునుంచి నేర్చుకొని ఆచరణలో పెట్టి నడుపుచున్న జీవితమునే జ్ఞానజీవితం. పుస్తకములను విచారణచేసి తెలిసియు, తెలుపనేర్చియు, ఆ చరణలేని స్థితి జ్ఞానము కానేరదు. ఆచరణయుక్తమైన విచారణకే జ్ఞానము, దుర్విషయాదులు కలుగవలసిన పరిస్థితులేర్పడినపుడే, సద్విషయములు ఆచరణలో పెట్టగలశక్తికే జ్ఞానము. అన్ని అవయవాదులకు సాత్వికాంశముతో గూడిన ప్రకాశత్వమునకే జ్ఞానమందురు. 1 మనసు యిందిృయములు విషయానుభవకాలములో అసంగత్వ స్థితికి 2 జీవేశ్వరైకత్వ స్థితికి 3 సర్వేంద్రియ వ్యాపారములుచేసి, చేయని స్థితికి (అకర్మస్థితి) 4 మనోవాయువులు చలింపని సమయములోనున్న అనుభవమును అవి చలించుచున్న సమయములో కూడా ఆ యనుభవము వున్న స్థితికి 5 జాగ్రత్స్వప్న సుషుప్తత్వ స్థితికి 6 ప్రశాంతత్వ స్థితికి 7 నిర్వికల్ప సవికల్ప సమాద్యనుభవ స్థితికి 8 శరీరాదులను మరచిన సమయములోనున్న జాగ్రత్వ స్థితికి జ్ఞానమని సర్వశాస్త్రముల సారమైనది. ఈ స్థితి కలుగుటకు చేయుపనులకు జ్ఞానకర్మలని సత్కర్మలని పేరు.

14. మోక్షం : జ్ఞానములో చెప్పినట్లుచేసి ఎల్లప్పుడు సర్వేంద్రియ ప్రకృతిసుఖానుభవ జీవితమే మోక్షం. ఎన్ని వడుదుడుకులు వచ్చినగాని చలించని మన స్థితియే మోక్షము. కష్టసుఖములు కలిగినప్పుడు విజ్ఞానశక్త్యానుభవము తగ్గకుండని స్థితి త్రిగుణములకు లోబడనిస్థితి. నిత్యసుఖస్మృతిగానుండుట దేహేంద్రియ ప్రాపంచికాతీతానుభవ స్మృతితో కోరినంత కాలమునుండుట దీనిని బొందుమార్గము అష్టాంగ యోగానుభవములతో విచారణచేయుచూ శుద్ధ సాత్వికవిషయవ్యాపారాదులతో దేహేంద్రియములతో ప్రవర్తించుటే దీనికి ముఖ్యమార్గం. సద్గుణారూఢులగువారితో పై చెప్పిన అనుభవములు కలిగినది లేనిది ప్రతివారు తగినవారిచేత పరీక్షించబడవలెను. గాని తమకుతాము మేము మోక్షంపొందితిమని అనుకొన్నంత మాత్రాన చాలదు ప్రయోజనంలేదు. సద్గురానుభవంలేని గురువు చేసేయొక మంత్రం చెప్పించుకొని అంతా పూర్తియైనట్లు గర్వించువారలగతి యేమగునో చెప్పలేము. మోక్షం పొందినవారలకు బాహ్యగుర్తులు. 1 జంట స్వరములు యెప్పటికప్పుడుండును. 2 సాత్వికగుణమే వ్యవహారకాలములోకూడా వుండును. 3 హంసలు తగ్గివుండును. 4 శబ్ద స్పర్శ రూపరస గంధములు తెలియకుండును. తెలుసుకోవలెనన్నప్పుడుమాత్రం తెలుసుకొనగలుగును. 5 భక్తి అనగా గగుర్పాటు, ఆనంద భాష్పములు, ఆవలింతలు, తేపులు, స్తంభీభూతం, రోమాంచం కోరినప్పుడెల్లా కలుగుచుండును. 6 అభిమానగర్వాది దుర్గుణములు వాసనకైనా కలుగకుండుట. 7 తనను యితరులు చూడగానే జ్ఞానాదివాంఛలు తాత్కాలికముగానైననూ కలుగునట్లు

గు_ర్తించుట. 8 భూతభవిష్యద్వర్తమాన విషయములు తెలుసు కొను శక్తికలిగి కోరినప్పుడు తెలిసిచెప్పుట. 9 నిగ్రహానుగ్రహ సామర్థ్యానుభవముకలుగుట. 10 ద్వంద్వాతీతముగా జీవించుట. ఆంతరంగిక గుర్తులు = మనస్సు ఎల్లప్పుడు విషయాతీతం, గుణాతీతం నిర్విషయాకారవృత్తి ధారణ కోరినంతసేపు నిల్వ గలుగుట జీవాత్మ పరమాత్మైక్యానుభవము.

15 స్వర్గ నరకానుభవము : నరకం, స్వర్గం చచ్చిన తర్వాత వచ్చుననుటకంటె బ్రతికియున్నప్పుడు కలిగే స్వర్గనరక ములను చూపుట మంచిది. అట్లంటిననిచచ్చినతర్వాత లేవనుట కాదు. ఇక్కడ స్వర్గం = ప్రాపంచిక విషయానుభవములకు కొరతలేకుండా వున్నంతలో సంతుష్టిఅయిన విషయభోగములు అనుభవించుచూ ఎల్లప్పుడును సుఖమునే అనుభవములో నున్నట్లు స్ఫురణతో యేకొరతలు లేని స్థితియే స్వర్గం. నరకం = వున్నంతలో సంతుష్టిలేక ఎప్పుడు కొరతగాను విషయాను భవములతోగూడి, దుర్విషయవాంఛలచే బాధలు సదా అనుభ వించుచూ జీవించుటయే నరకం. చచ్చిపోయినతర్వాత అనగా స్థూల శరీరమునుండి సూక్ష్మశరీరంలేచి బైటకు ఎన్నటికి ఆ స్థూల శరీరంలోనికి రాలేనిదేచావు. సూక్ష్మశరీరం సూక్ష్మా కాశములో కలలు గనుచున్నవిధముగా చెడుకలలు కనుచు న్నప్పుడు కలుగునట్టి బాధలుగాను, మంచికలలు కనుచు న్నప్పుడు సుఖముగావున్నట్లు, తిరిగి జన్మవచ్చేపర్యంతము అట్లు కలలు కనుచున్నమాదిరిగా సుఖ దుఃఖములను పొందుచూ బాధలు అనుభవించుటే నరకం. అప్పుడు స్థూలశరీరంలేదుగనుక ఆబాధలు తప్పించుకొనుటకు వీలులేదు. స్వర్గముకూడా మంచి

కలుగుకన్నట్లే సూక్ష్మశరీరం సంతోషముతో అనుభవించు కాలమే స్వర్గం అందుకుతగిన పరికరములు బ్రతికియుండగా సంకల్పాదులతో, సంకల్పానుకూల రూపములు సూక్ష్మ శరీర మందు సూక్ష్మరూపములు దాల్చియున్నవి. అవి అధిష్టాన దేవతలవల్ల ప్రేరేపింపబడి సుఖదుఃఖములను అనుభవించునట్లు చేయుటయే స్వర్గనరకములు. చేసిన పుణ్యాపాపములకు తగిన ఫల ములు అనుభవించి ఆకర్మానుసారముగా తిరిగి ఒక స్త్రీలో పాధిలో యీ సూక్ష్మశరీరమును ప్రవేశపెట్టుటయే పునర్జన్మ ములు. యీపనులన్నింటిని జరిపే అధిష్టాతలున్నారు. మనము అనుకొనునట్లు ఒకానొక స్థానములో యమలోకం వున్నదని, యముడు యమకింకరులున్నారు అక్కడకు యీజీవుడు వెళ్ళి కష్టములుపొందుననుకొనుట అబద్ధం.ఎక్కడెక్కడ బాధో అక్క డక్కడే నరకం. యముడున్నాడు, యమధర్మరాజు యమకిం కరులు సృష్టిఅంతటా వ్యాపించిన బాధకరమైన శక్తులు పనులకే ఆయాపేర్లు, ఆయా ఆకారములు కల్పించిరి, యక్కడో యము డుండి జీవులుచేయు కర్మలు చూచుటలేదు. సృష్టి అంతటా వ్యాపించినధర్మమును ప్రతిష్టించుటకు ఏర్పడిన ధర్మశక్తులకే యముడు. యమకింకరులు ధర్మమును తొలగగానే బాధ కలు గును. ఆ బాధే యముడు. యిట్టి యమునికి బలులు లంచాలు పెట్టిన యెట్లు ఆనరకము తప్పగలదు? ధర్మమును తప్పకుండా నడుచుటే నరకబాధ లనుభవమును తప్పించుకొనుట ధర్మం తప్పివచ్చే నరకానుభవమునకు జపం ఎన్నికోట్లు వందలు చేసినా ఎన్ని తీర్థములలో మునిగినా, ఎన్ని హోమాదులుచేసిననూ, ఎన్నెన్నో తపోనిష్టలు యోగాలు చేసిననూ తప్పనిసరిగా అను భవించే తీరవలెగాని పోవు. ఆకష్టములు అనుభవించే తీరవలెను.

అట్లు చెడుప్రవర్తన ప్రవర్తించుటెందుకు ఆవచ్చే కష్టనష్టము
లను పోగొట్టుకొనవలెనని మళ్ళీ కష్టనష్టములే పడేపనులుచేయు
టెందుకు ధర్మమార్గ ప్రవర్తన తేలికగానేయుండును. అట్టి
వారికి యే ఒడుదుడుకులుండవు రావు. యథావిధిగా ఏఏసుకర్మ
లను ఏఏవిధముగా చేయవలెనని పెద్దలుభగవంతుడు ఏర్పరచిరో
అవిధముగానేచేయు సుకర్మలు దుష్కర్మలకు విరుగుళ్ళు. దు
ష్కర్మలు సుకర్మలకు విరుగుళ్ళు. గాని మోక్షమునకుమాత్రం
యీరెండూ అవసరములేదు. మోక్షం కర్మరహితత్వస్థితి.
యింద్రియాదులు లేనిస్థితి, సాధనసామగ్రి లేనిస్థితి. దీనినే అకర్మ
అందురు. మంచికర్మలకు సత్కర్మలని, చెడుకర్మలకు వికర్మలని,
కర్మలేనిస్థితికే అనగా చేయుచుండినా చేయనట్లుండు స్థితికే
అకర్మలని చెప్పిరి. కర్మలలోను మంచిచెడు బాధలున్నవని అను
భవము అందరికిగలదు. జపంలోమాత్రం, యోగంలోమాత్రం
బాధలులేవా? అవి చేయుచున్నప్పుడు కాళ్ళు నెప్పులు. నడుం
నెప్పి కలుగుటలేదా? ఆ బాధలకు ఫలం మోక్షం దొంగతనం
అబద్ధములు, కుత్సితము మొదలైన దుష్టకర్మలకు బాధలేఫలం.
అదే నరకం. జపాదులలో కొంచెం బాధ పడిననూ, తరువాత
నిత్యానందసుఖమే ఫలం. మోక్షంకూడా కలుగును. మోక్షాను
కూల సత్కర్మలు బాధలు కలిగినా చేయవలెను. ఏదోయొక
రూపములో యిష్టమైనా యిష్టముగాకపోయినా కష్టములు
అనుభవించే తీరవలెను. అవతారములను దేవునిగాభావించు
రామకృష్ణాద్యవతారములనైనా తప్పు లేదుగదా? తనకిష్టమైనా
రూపములో ఆబాధలును అనుభవించిరి. అది నరకమనుకొనరు.
గాని బాధలే గదా? ఒక అన్నదానము చేయుచున్నారనుకో
అందుకుపడే శ్రమలు ఎన్నెన్నో విచారించుడి. ఆశ్రమలను ఎవ

కైనా నరకబాధ లనుభవించుచున్నారనెవరా? అట్లనుకుంటే యింకా అజ్ఞానం పాపం వున్నదా? జప, తప, దాన తీర్థయాత్రాదులందు పడుబాధలు, కష్టములు, నరకబాధలని, పాపఫలమనిగాని చెప్పుటకు సాహసింతురా? నిరభిమానంగా నిరహంకారిగానున్న ప్రతిజ్ఞాని ఒప్పుకొనక తప్పదు. ఎంకష్టంగానున్నగాని మోక్షమునకు కావలసినపనులు చేయకపోయినయెడల అంతకంటె ఎక్కువ కష్టనష్టములు లేగాక ఆజన్మాంతరము బ్రతికియుండియు చచ్చినవానివలె అనేకరెట్లు ఎక్కువబాధలు అనుభవించువానిని వానిని ఆశ్రయించిన వారలుకూడా కష్టనష్టము లనుభవించుట అనుభవనీయములే. ఏ పనిగాని మొదట కష్టము తర్వాత సుఖము కల్గించునో అది మోక్షమునకు సహాయమొనర్చును. ఏపని మొదట సుఖమున్నా ఫలానుభవకాలమున దుఃఖమును కలిగించునో ఆపనులు దుష్టకర్మలు అదే నరకము. అట్లు ఆజన్మలోనే బాధ లనుభవించుటగాక మనుజన్మలకు కూడా జన్మపరంపరలకు హేతువులు. చచ్చినతర్వాత స్వర్గనరకములు నిజమైనఅర్థం జన్మవచ్చేవరకు సూక్ష్మశరీరం మనం కలలలో దుఃఖం, కష్టం కనుచుండుటఎట్లో అట్లేఅనిన్నీ, మంచి సుఖములు అనుభవించుచున్నట్టు కలలుకనుటయే స్వర్గమనిన్నీ, ఆస్థితికే, దేవలోకమునుపొందుట అనిరనిసారాంశము కొందరికి చచ్చినవెంటనే జన్మ కలుగును. అట్టివారలకుపై చెప్పిన, కష్టసుఖములుపై చెప్పినట్లు లేక క్రొత్తజన్మలోఅనుభవమునకు వచ్చును. గనుకయిక్కడగాని, చచ్చినతర్వాత సూక్ష్మశరీరంగాని అనుభవించే కష్టసుఖములకే స్వర్గనరకములని సారాంశము. ప్రతి మనుజునకు స్వర్గమూ, నరకమూ నాకువచ్చేది అని సంశయము కలిగినప్పుడు యిప్పుడు కష్టసుఖములు సంగత్వము కలిగించు

చున్నవా లేదా అని ఆత్మపరీక్ష చేసుకొనినయడల, వున్నట్లు యిప్పుడు వున్నయడల, మరుజన్మ వచ్చేవరకు వున్నవనిఅనుకొనవలెను. అసంగుడై కష్టసుఖముల అనుభవకాలములో అనుభవంతేనిస్ఫురణ అనగా నిరాకారాకారవృత్తి ప్రతినిముషము స్ఫురించువారలకు, యెప్పటికీ లేవని,ధృవముగానమ్మిచరించుచుండవలెను యితరులు అన్నంతమాత్రమున, తనకు స్వర్గనరకములు జన్మపరంపరలు, వున్నవని సందేహాదులుపడకూడదు. చేయనివానివలె, యెల్లప్పుడు, తనమానసేంద్రియములు, నిర్గుణనిరాకారవృత్తి ఆనందమును స్ఫురించుచున్నట్లు అనుభవముకలుగుటేమోక్షం. అట్టివారలకు జన్మలు ముందూలేవు. యిప్పుడే లేనట్లు స్ఫురణ వున్నందున యెప్పటికి లేనేలేవు. సృష్టిఅంతటా వ్యాపించినధర్మమును ప్రతిష్టించుటకు ఏర్పడిన ధర్మశక్తినే యమాదులుఅనిపేరు. ధర్మమును తొలగగానే బాధ కలుగును. ఆబాధే యముడు. యిట్టి యమునికి బలులు లంచాలుపెట్టిన యెట్లు ఆ నరకబాధలుతప్పగలవు. ధర్మం తప్పకుండానడుచుటే నరకబాధలు అనుభవించకుండా వుండుటకు మార్గమైయున్నది. ధర్మంతప్పి వచ్చే నరకానుభవమునకు జపం ఎన్నికోట్లు చేసినా ఎన్ని తీర్థయాత్రలుచేసినా, ఎన్నిహోమాలుచేసినా, ఎన్నెన్నో దానాలుచేసినా, ఎన్నెన్నో తపోనిష్టలు, వ్రతాలు, యోగాలు చేసిననూ తప్పనిసరిగా ఏదో ఒకరూపములో యిష్టముగా నున్ననూ, అయిష్టముగా నున్ననూ కష్టసుఖములు అనుభవించే తీరవలెను. దేవునిగాభావించు అవతారములున్నా కష్టసుఖములు యిష్టమై అనుభవించినారు. అది నరకమనుకొనరు. గాని బాధలే గదా! ఒక అన్నదానము చేయుచున్నారనుకో అందుకుపడేశ్రమలు ఎన్ని రకములో విచారించుడి. ఆశ్రమ

లను ఎవరైనా నరకబాధ లనుభవించుచున్నారనెదరా? అట్లను కుంటే యింకా అజ్ఞానం పాపం వున్నదా? జప, తపో, దాన తీర్థాదులందుపడు బాధలు, పడు కష్టములు, నరకబాధలనిగాని, పాపఫలమనిగాని చెప్పవచ్చునా? బాధలు కలుగుటలేదా! నిరభిమానంగా నిరహంకారిగానున్న ప్రతిజ్ఞానియూ బాధ లనుభవించిరని ఒప్పుకొనకతప్పదు. ఇష్టమైన బాధలుగనుక పాపఫలమనము, నరకమని అనము, గాని కష్టములు తప్పలేదుగదా అవి మంచికష్టాలు చెడుకష్టాలైతే కష్టాలకుమంచిఏమిటి? చెడేమిటి అయితే అవి (జప, తపాదులు) చేయువారలకు పుణ్యాంవస్తుందని, పాపం పోతుందని విధిగా చేయవలెనని అనుకొనుట చేయుటెట్లు? అవి చేయనియడల ఉత్తీర్ణులగుటెట్లు? నరకమేఅనుకుంటే అనగా బాధ లనుభవించటమే అయితే విధిగాచేయవలెనని ఎందులకు? ముల్లుకిని ముల్లుకే పోగొట్టునన్నట్లు కొన్ని విరుగుళ్ళున్నవి. అట్లే కొన్నికర్మలకు కొన్నికర్మలు విరుగుళ్ళున్నవి. దుష్కర్మకు సత్కర్మలు, సత్కర్మలకు దుష్కర్మలు విరుగుళ్లు. అందుచే సత్కర్మలు అనగా విరుగుడు కర్మలనమాట చేయకపోతే దుష్కర్మలు పోవు. బాధలున్ననూ సత్కర్మలు చేయవలెను. దుష్కర్మలు పోకపోయినయడల మనో యింద్రియాదులు నిర్మలముగా నుండకపోగా బాధలు అనేకవిధములుగా అనుభవించవలెను. (ఉ) దుర్మార్గులతో సంభాషణాదులు చేసినామనుకో అప్పుడు కొంతపాపం మనకుకలిగి మనోయింద్రియాదులు నిర్మలముగా నుండకపోవుటచేత స్వరూపానుసంధానము కుదరక కొన్ని రోగములచేతకూడా బాధలు పడవలసివచ్చును. అప్పుడు జపాదులలో ఏదైనాఒకటిచేసి ఆపాపమును పోగొట్టుకొనవలెను. యిట్లే ప్రతిపాపకర్మకు వూహించుకొనవలెను. శక్త్యానుసారం

సత్కర్మలనుచేసి దుష్కర్మలకువిరుగుళ్ళు చేసుకొనవలెను. ప్రతి మానవుడు శక్త్యానుసారం యజ్ఞ, దాన తపోనిష్టలు చేయుచునే యుండవలెనని విధించిరి. ఏ దుష్కర్మకు ఏ సత్కర్మ ఏవిధిగా చేయవలెనని, బాగావిచారించి, విధిపూర్వకముగా చేయవలె గాని విధితప్పిచేసిన సత్కర్మలైననూ, దుష్కర్మలుపోకపోగా యింకాకొంత పాపముకూడా వచ్చుటకు ఆధారమగును. గాని మోక్షమునకుమాత్రం ఏదియూ అవుసరంలేదు. సత్కర్మ దుష్కర్మలు అవుసరంలేదు, జపంచేయునపుడు, యోగంచేయు నపుడు, నడుంనొప్పి, కాళ్ళనొప్పులు గలుగుచుండును, అందు వల్ల బాధకలుగును. ఆ బాధలవల్ల మోక్షంకలుగును. బాధ కంటే మోక్షసుఖమే అనేకరెట్లు ఎక్కువగాకలుగును. మో క్షానుకూల సత్కర్మలు. బాధయోగ్యమైనా చేయవలెను; అన్నాదులు సంపాదించునపుడు కష్టములు కలుగునని చేయక పోయినయడల కష్టములు యెక్కువగునుగాని తగ్గిపోకపోగా, కష్టములు ఎక్కువగుచుండును. మోక్షానుకూల సత్కర్మలు జప, యోగాదులు కష్టమునైనా చేయవలెను. నిత్యసుఖ ప్రాప్తికికూడా చేయుపనులున్నా, బాధలు కలుగునని చేయక పోయినయడల అంతకంటె కష్టనష్టములు ఎక్కువగా అనుభ వించుటే ఆజన్మాంతరం బ్రతికియున్నంతవరకూ కష్టములు అను భవించుటకంటె బాధయోగ్యములైననూ, జప, యోగాదులు చేసి ఆ నిత్యసుఖప్రాప్తిపొందుటే యోగ్యమైనపని, ఇదే పురు షార్థము సంసారదుఃఖములు ప్రతినిముషమూ అనుభవించు వారిని ఆశ్రయించువారలకుకూడా ఆ ఫలములే దానముచేసె దరు. ఏపనిగాని మొదట కష్టమున్నా తర్వాత సుఖమును కలి గించునో అవి మోక్షమునకు సహాయమొనర్చును. మొదట

సుఖమును. తర్వాత దుఃఖమునుకలిగించునో ఆకర్మలు దుష్క
ర్మలు, అవే నరకం. ఆ కర్మలు ఆజన్మాంతరమేగాక మరుజన్మలకు
కూడా హేతువులగును. గనుక చచ్చినతర్వాత స్వర్గనరకములు
నిజమైనఅర్థం. జన్మలువచ్చేవరకు సూక్ష్మశరీరం, మనం కలలో
దుఃఖం, కష్టం, నష్టం మొదలైనవి కనుచుండుట ఎట్లో అట్లే
అనిన్ని మంచిసుఖములు అనుభవించుచున్నట్లు కలలుకనుటే
స్వర్గమని ఆస్థితికే దేవలోకమునుపొందుట అని సారాంశము.
కొందరికి చచ్చినవెంటనే జన్మలుకలుగును. అట్టివారలకు పై
చెప్పిన కష్టసుఖములు అనుభవించు స్వర్గనరకములు లేక పూర్వ
జన్మయందుచేసిన పుణ్యపాపకర్మానుభవము కొత్తజన్మలో అను
భవమునకువచ్చును. గనుక యిక్కడగాని చచ్చిపోయినతర్వాత
సూక్ష్మశరీరంగాని అనుభవించే కష్టసుఖములకే స్వర్గ నరకములు
కలలుకన్నట్లు అనిసారాంశము.

ధర్మాధర్మస్వరూపం: సామాన్యముగ ధర్మం అనగా
యితరులకు ఏవైనావస్తువులను కోరకే ప్రతిఫలం పుచ్చుకొన
కయే యిచ్చుట ధర్మమందురు. గాని అదికాదు ధర్మస్వరూపం
సత్కర్మలన్నియూ. సద్గుణసంపత్తిఅంతయూకలిసి ధర్మమందురు.
ఒక్క యివ్వడంమాత్రమేకాదు ధర్మం సత్పదార్థమంతయూ
ధర్మస్వరూపమే. అవి ఆచరించుటే ధర్మాచరణ ధర్మంచేయుట
అనవలెను. ధర్మాచరణ మోక్షహేతువు. యితరులకు కోరికే
వస్తువులను యిచ్చుట దానమనబడును. యిది ఫలాసక్తితో
చేసినవారలకు బంధహేతువు, జన్మహేతువు, బాధహేతువు
అయివున్నది. ధర్మాచరణులకుఅట్టిఫలములు లేక మోక్ష హేతువే
అగును. అట్టి ధర్మమును నిరూపించుట యుక్తము. అయా అవ

మాదులకు స్వతస్సిద్ధమైనపనులు తగినంతగా సమయాను కూలంగా చేయుట ధర్మమాచరించుటఅగును. అస్వాభావికమైన పనులు అమితముగాను, సమయానుకూలం గాకుండాను చేయుటే అధర్మాచరణ మనంబడును. అనగా నాలుకకు రుచి చూచుట స్వాభావధర్మం. ముక్కునకువాసనచూచుట స్వాభావధర్మంసువా సనద్రవ్యాదులు వాసనచూడవలెనని కోరిక ముక్కునకు అస్వా భావధర్మం. ఇట్లే ప్రతి యింద్రియమునకు గ్రహించవగును. దీనినే ధర్మాచరణ అనవలెను. గాని ఒక్క దానము చేసినంత మాత్రమునకు ధర్మాత్ముడనని గర్వపడరాదు. ఆ దానాదులు అపాత్రునికి చేయుటవల్ల విపరీతఫలమే గాని, సత్ఫలము చేకూరదు. ధర్మాచరణలో దానముచేయుట అనేది కోటో వంతుఅగును. ఒకరికి ఒకకబళం అన్నం పెట్టినంతమాత్రాన దాహము పోసినంత మాత్రాన, పరుండుటకు చోటిచ్చినంత మాత్రాన ధర్మాచరణ చేసినవారమని విర్రవీగువారనేకులు గలరు. అదియూ చేయనివారలకంటె వారుత్తములగుదురు. గాని ధర్మాచరణులు మాత్రం కారు. ధర్మాచరణ పూర్తిగా చేసినవారలకు మోక్షం•కరతలామలకం సరికదా. యితరులను తరింపచేయుటకూడా బహు తేలికకదా అట్టివారలేగదా సద్గురువులు, కారణ గురువులు, యోగులనిపేర్లు చెప్పుటేగాని యింద్రియనిగ్రహం చేయవలెనని, వాయునిగ్రహం చేయవలెనని మనోనిగ్రహం చేయవలెనని, శాంతముగా వుండవలెనని, కామ క్రోధాదులను జయించవలెను అని మాత్రం చెప్పుదురేగాని సమయానికి చేయలేక యితరులకు బోధ చేయువారలను సమీపించనైనా సమీపించరాదు సరికదా వారి ననుకరించువారలకు దుర్నిమిత్తాదులు కలిగి వుభయులూ

నరకకూపమున కూలుదు రనుటకు యిప్పటి కార్యగురువులే
దృష్టాంతము. పురాణముగా శిష్యులకు చెప్పినపుడు మాత్రం
ధర్మములు యేకరేవు పెట్టెదరు. సమయానికి మాత్రం కామ
క్రోధాద్యావేశములకు లోబడి అధర్మాచరణే చేయుదురు.
ధర్మస్వరూపం అంటే ఆఖరుమాట పరమాత్మస్వరూపమే. జ్ఞాన
విజ్ఞానాది సమస్తయోగ విధానములు ఒక్క ధర్మాచరణ అను
పదములో యిమిడియున్నది. అంతేగాని తనకున్నంతలో యిత
రులకు పెట్టినంతమాత్రాన ధర్మాత్ములమని విర్రవీగకండి. సృష్టి
స్థితిలయములకు ధర్మమే ఆధారము. ధర్మమే జయంఅనుట
కిదియే అర్థం. దీనినే సత్యప్రవర్తన అనికూడా అనవలెను.
అప్పుడు సత్యమే జయమనిరి. ఒక్క నిజము చెప్పినంతమాత్రాన
సత్య మాచరించినవారలు కారు. సర్వేంద్రియములకు వాటి
వాటి స్వతస్సిద్ధమైన పనులు ఆచరించుటే మొత్తమునకుకలిపి
సత్యమాచరించుట సత్యము పలుకుటఅగును. సత్యముపరమాత్మే.
అసత్యము తదితరమంతయూ అగును. గావున ధర్మస్వరూప
మైన అనగా సత్యస్వరూపమైన పరమాత్మను అనుభవనీయు
లైన సద్గురువులను ఆశ్రయించి అభ్యసించవలెను. గాని మాట
లతో కబుర్లతో రాదు. గనుక ధర్మాధర్మములను దానాదానము
లనరాదు. మోక్షహేతువులైన పనులను ఆచరించుటే ధర్మా
చరణమని, బంధహేతువులైన పనులను ఆచరించుటే అధర్మా
చరణమని సారాంశము. మోక్షహేతువులైన పనులెవ్వియో
1 పాత్రులకు సద్విషయములు యిచ్చుట 2 అనుభవనీయు
లైన పెద్దలను ఆశ్రయించుట సాకార నిరాకార భగవత్సేవ
3 ఇంద్రియ నిగ్రహాదులు ఇవియే ధర్మములు తదితరములు అధ
ర్మములు (శాస్త్రసమ్మతములైననూ, మహనీయుల ఆచరణలై

నగా తనకు బంధముకలిగించు పనులైనయడల అవియే అధర్మములనిరి) ప్రతివారికి ఒకేపని బంధముగావుండవచ్చు, అదేపని మరి ఒకరికి మోక్ష హేతువై వుండవచ్చు గనుక ధర్మాచరణలో తనకు బంధహేతువుగానున్న యెడలను, అనారోగ్యాది బాధ హేతువులుగానున్ననూ వాటినివదలి మరియొకధర్మమును ఆచరించవచ్చును. ఉ॥ ప్రాణాయామంచేయుట కొందరికి బంధహేతువైన, మరియొక ధర్మమైనధారణ మొదలగునవి చేయవచ్చును అనుట.

16. **శాస్త్రము :** పరమాత్మస్వరూపమును అనుభవమగుటకు ఏర్పరచిన విధులును, దానికి వ్యతిరేకమైన విధులును గురించి తెలుపు పుస్తకములకు శాస్త్రములనెదరు గాని ప్రతి దురాచరణను శాస్త్రములో చేయమని చెప్పియున్నది. పెద్దలు చేశారు అని వుదాహరణలు చూపుటకు, అజ్ఞానులను మోసపుచ్చుచున్నారు. వినువారలు యిట్టివి ఆచరించినందున పరమాత్మ దర్శనమాయెనా? మానసేంద్రియములు జీవునికి అనగా తనకు వశీకరమాయెనా? ఆరోగ్యాదులకైనా హేతువులా? అని విమర్శనైనాచేసి తన స్వానుభవమునకు సరిపోయెనా? అని విచారించిన శాస్త్రీయమో అశాస్త్రీయమో తమకే తెలుసును. ఉ॥ శాస్త్రంలో మాంసం తినవచ్చు, కల్లు త్రాగవచ్చు అని వ్రాసియున్నవని కొన్ని అచ్చుపుస్తకములను దుష్టులు వ్రాసిన వాటిని చూపెదరు. ఆ పుస్తకములు ఏ యింద్రియలోలురో వ్రాసినవని, వాటిని వదలివేయవలెనేగాని శాస్త్రీయములని ఆచరించకూడదు, వినకూడదు చదువరులకు బుద్ధి నశించెనా? యుక్తాయుక్తములను గ్రహించలేనిశక్తిలేనివారలైతేనే, వాటిని నమ్మి ఆచరించెదరు. వాటిని నిదర్శనములుగా తీసుకొందురు.

గాని ఏమాత్రం బుద్ధిగలవారైనా పై చెప్పినపనులు చేయవచ్చు
నని ఎవరో దుర్మార్గులు వ్రాసియుండవచ్చునని వాటిని వాసన
కైనా అట్టి పుస్తకములను నమ్మరు. మరొకమారు చూడనైనా
చూడరు. వాటిని చూచువారలు, చెప్పువారలు యింద్రియ
లోలురైతే పదేపదే అట్టివి చదువుచూ, యితరులకు బోధిం
చుచూ శాస్త్రసమ్మతముగా నడుచుచున్నామని సంతోషించి
వీరే అట్టి కొందరకు గురువులై యున్నారు.

17. బ్రహ్మవ్రాత : ఇట్టి విషయములుకూడా శాస్త్ర
ములలో ప్రచురపరచబడెను. బ్రహ్మదేవుడు మనకు చెడు మంచి
మొదటనే వ్రాసిపెట్టియున్నాడని, ఆ వ్రాతప్రకారమే జరుగు
నని, అట్లే జ్యోతిశాస్త్రరీత్యా శరీరమునకువచ్చే ఆధి వ్యాధులు
సిరిసంపదలూ విద్యాబుద్ధులు మొదలైనవికూడా పూర్వజన్మ
కర్మరీత్యా మొదటే నిర్ధారణ చేసియున్నట్లునూ, అదేరీతిని
జరుగునని ప్రయత్నము చేసిననూ తొలగవని వ్రాయబడి
యున్నవి. అజ్ఞానులకు అన్ని శాస్త్రములునూ నిజమేఅగును.
వారికొరకే అనేకవిధములు కల్పించివ్రాసినారు. అవిఅన్నియూ
కల్పితములైననూ వారలకు నిజమేఅయినట్లు కన్పించును.
సాముద్రికశాస్త్రరీత్యా మనశరీరములోగల గీతలనుబట్టి, కొన్ని
పుట్టుమచ్చలనుబట్టి, సిరిసంపదలూ, ఆయురారోగ్యములు కీర్తి
అపకీర్తులు మొదలైనవన్నియూ మొదటే బ్రహ్మవ్రాసియుంచి
నట్లు నమ్మి ఆయాపనులు జరుగనివ్వకుండా వుండుటకు ప్రాయ
శ్చిత్తాది శాస్త్రములలోగల పనులుచేసి పోగొట్టుకొనుటకు
ప్రయత్నించి, తీర్థయాత్రాదులు, సమారాధనలు, జప తపా
దులు, బలులు మొదలైనవిచేసి పోగొట్టుకొన ప్రయత్నించుట

నిష్ఫలమనోరథులగుటే అనుభవసిద్ధము. ఇవి అన్నియూ అజ్ఞా
నులకేగాని జ్ఞానులకు ఆ శాస్త్రాదులన్నియూ అబద్ధములే గనుక
ప్రాయశ్చిత్తాది శాస్త్రమునుబట్టి బ్రహ్మవ్రాతకూడా పోగొట్టు
కొనవచ్చుననేకదా తెలియుచున్నది. వ్యతిరేక క్రియలవల్ల
లోగడచేసిన కర్మలనుబట్టి విధిని తప్పించుకొనవచ్చునని పురుష
ప్రయత్నము సద్వృత్తులతో సన్నియమములతో కొన్నిక్రియలు
చేసినయడల అనివార్యముగా అనుభవించవలెనని వ్రాసిన
వ్రాతలను తప్పించుకోవచ్చునని ప్రాయశ్చిత్తాదిక శాస్త్రాదులు
బోధించుచుండుట పెద్దలు నిశ్చయపరచే యున్నారు. గాన
యీక్రింది చెప్పబోవుప్రకారం చేసినయడల ప్రారబ్ధాదికము
లను ప్రయత్నపూర్వకముగ తప్పించుకొనుటకు ప్రయత్నింప
వలెను. 1. మానసేంద్రియములను నియమించు వుపాయము
నెఱింగి లెస్సగాచేయగల సామర్థ్యమును సద్గురువులవద్ద ప్రతి
మానవుడు బాల్యముననేనేర్చుకొని ఉత్తీర్ణులుగానేయుండవలెను.
2.అట్లు బాల్యమున స్త్రీ,పురుషులు, యేజాతివారైనానేర్వకున్న
యడల యౌవనమందైనా సరే అదీ తటస్థించక పోయినయడల
ముసలితనమందైనాసరే యెప్పుడు బుద్ధిపుట్టి అవకాశము తట
స్థించునో అప్పుడైనా అనుభవసీయులైన సద్గురువులవద్ద నేర్చు
కొనవలెను. 3.మనోయింద్రియాదిప్రాపంచికవిషయభోగములకు
లోనైనవారికే అనగా వాటికి స్వాధీనుడైన జీవునికే పై చెప్పిన
శాస్త్రాదులలోగల విధికి బద్ధుడై అనివార్యముగా అనుభవించి
తీరవలెననే శాస్త్రము ప్రతిపాదించి తప్పనిసరిగా విధిని దాట
యెవ్వరికి శక్యముకాదని వ్రాసినవిగాని ఒక్కపెట్టున ఆ శాస్త్రా
దులమీద నిరాకరణభావము ఒక్క నిముషములో కల్గించుకొని
లక్ష్యము ఆవిధి శాస్త్రాదులమీద స్ఫురణలోకైనా రానివ్వ

కుండా చేసుకొనుచూ, వచ్చినయెడల నిరాకరించుకొనుచూ రామనామ మను మధురాక్షరములమీద తన లక్ష్యమంతా నిల్పి భజించుచూ, సద్గురువులచెంతజేరి, వారల ఉపదేశానుసారముగా వర్తించువారలకు పూర్వకర్మానుసార విధివ్రాతలను తొలగించుకోవచ్చునని అనుభవసిద్ధమైన నమ్మకముతో చూచి చేసి వ్రాసినాను. గాని నమ్మించి మోసపుచ్చుటకు వ్రాసింది కాదు. నేనుగాక, లోగడే ప్రాయశ్చిత్తకాండ శాస్త్రాదికములో వ్రాసేయున్నారు. గాన భ్రమాదిక వ్రాతలని భావింపజనదు. అట్లు అనుకొనినయెడల ఆ విధికి బద్ధులై ప్రారబ్ధానుసారం జీవయాత్ర గడపుకొనుటే తప్పనిసరి. గనుక గడచిన దానికి వగవక యికనైనా బాగుపడవలెననే ఆశగలవారలు నేనువ్రాసిన విధముగా తన శక్తిఅంతతో సత్ప్రయత్నము చేయుటకు స్థిరపరుచుకున్న ప్రతివారు ఆచరించి తత్ఫలమువచ్చినది లేనిది చూచుకొని, కలుగనియెడల, మాసాంప్రదాయకస్థులనుగాని, నన్నుగాని కలుసుకొని విచారించవలెను. చేసినంతగా ఫలము చేకూరే వుండును. తక్కువచేసి ఎక్కువ ఫలము రమ్మంటే రాకపోవచ్చు. గనుక పూర్వకర్మలు చెడువైనా లెస్సగా శక్తికొలది ప్రయత్నించిన యెడల సత్ఫలములుకలుగుననుటకు సందేహము లేదు.

18. <u>అనుభవనీయుల గురువుల లక్షణములు</u> : వీరు ఎల్లప్పుడు స్వరూపనిష్ఠలోనుండి లోకులకు, ఆ లక్షణములనే కలిగించుచూ బోధచేయుచుందురు. తాము ఆచరించుచున్న వాటినే లోకులకుకూడా చెప్పి, చేయించుట వీరి స్వభావము.

త్రాము ఆచరించనివాటిని చెప్పనే చెప్పరు. ఆవేశములు ఎట్టి పరిస్థితులలోను పొందనే పొందరు.

19. వైరాగ్య బోధోపరతులు: విషయములమీద రాగద్వేషాదులు లేకుండుటే వైరాగ్యము. స్వస్వరూపానుభవము కలిగించుటే బోధ. సర్వేంద్రియములు వాటివాటి వ్యాపారములు చాలించినప్పుడుండు అనుభవమే ఉపరతిసుఖము ఇది లేనియెడల జ్ఞానము నిష్ఫలము గనుక విషయవ్యాపారములు నానాటికి చాలించుటే దీనికిమార్గము.

20. విషయానుభవములు: స్వరూపనిష్ఠకు భంగము కలిగించని వ్యాపారములుమాత్రమే శరీరమునకు కావలసినంత మట్టుకు మాత్రమే విషయములను స్వీకరించుచుండవలెను. మితము అన్నివిషయములలోనూ వుండవలెను.

21: జీవ, ఈశ్వరసృష్టి: ఈశ్వరసృష్టి పంచభూతములు వాట్లవల్లనైన జీవరాసులు, వాట్లకు కావలసిన విషయభోగాదులు, జీవనసృష్టి, వర్ణాశ్రమాచారములు, వాట్లకట్టుదిట్టములు పురాణాదులు.

22. దానధర్మములు: ఇవి శక్తికొలది ఆచరించుచునే యుండవలెను.

23. ప్రకృతి, ఆత్మ: ఈ రెండున్నూ కలిసే అభేదముగానేయున్నవి. వీటిని విడతీయ శక్యముకాదు సరికదా ఒకటిని విడచి ఒకటి వుండవు.

# ప్రార్థన.

౧ గురుర్బ్రహ్మా గురోర్విష్ణు గురుదేవో మాహేశ్వరః గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥ ౨ అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం తత్పదం దర్శితంయేన తస్మై శ్రీ గురవేనమః ॥ ౩ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా చక్షురున్మీలితంయేన తస్మై శ్రీ గురవేనమః ॥ ౪ మన్నాథో శ్రీజగన్నాథో మద్గురుశ్రీజగద్గురు మమాత్మా సర్వభూతాత్మా తస్మైశ్రీగురవేనమః ॥ ౫ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం నాదబిందుకళాతీతం తస్మైశ్రీ గురవేనమః ॥ ౬ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥ ౭ బ్రహ్మా నందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం విశ్వాతీతం గగన సదృశం తత్వమస్యాదిలక్ష్యం ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం మద్గురుం తం నమామి॥ ౮ ఆనందమానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం యోగీంద్రమీడ్యం భవరోగవైద్యం శ్రీమద్గురుం నిత్యమహం నమామి ॥ ౯ గగనసదృశమేకం సచ్చిదానందరూపం విమల మచలమాద్యం తత్వమస్యాదిలక్ష్యం సకలవిషయమూలం సర్వధీ సాక్షిభూతం పరమసుఖదభావం మద్గురుం భావయామి ॥ ౧౦ హృదయకమలమధ్యే నిర్విశేషం నిరీహం హరిహరవిధివేద్యం యోగిహృద్ధ్యానగమ్యం జననమరణభీతిభ్రంశి సత్చిత్స్వరూపం సకలభువనబీజం బ్రహ్మచైతన్యమీడే॥౧౧ శాంతాకారం భుజగశ యనం పద్మనాభం సురేశం విశ్వాకారం గగనసదృశం మేఘ వర్ణం శుభాంగం లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన

గమ్యం వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ॥
౧౨ మేఘశ్యామం పీతకౌశేయవాసం శ్రీవత్సాంకం కౌస్తు
భోద్భాసితాంగం పుణ్యోపేతం పుండరీకాయతాక్షం విష్ణుం
వందే సర్వలోకైకనాథం ॥ ౧౩ స్ఫురత్సహస్రారశిఖాతి తీవ్రం
సుదర్శనం భాస్కరకోటితుల్యం సురద్విషాం ప్రాణవినాశ
విష్ణోశ్చక్రం సదాహం శరణంప్రపద్యే ॥ ౧౪ విష్ణోర్ముఖోద్ధానల
పూరితస్య యస్యధ్వనిర్దానవ దర్పహంతా తంపాంచజన్యం
శశికోటిశుభ్రం శంఖం సదాహం శరణంప్రపద్యే ॥ ౧౫ హిర
ణ్మయీం మేరుసమానసారాం కౌమోదకీం దైత్యకులైక
హంత్రీం వైకుంఠ వామాగ్రకరాభిమృష్టాంగదాం సదాహం
శరణంప్రపద్యే ॥ ౧౬ రక్షోసురాణాం కఠినోగ్ర కంఠచ్ఛేదక్ష
రచ్ఛోణితదిగ్ధధారాం తన్నందకన్నామ హరేప్రదీప్తం ఖడ్గం
సదాహం శరణంప్రపద్యే ॥ ౧౭ యజ్జ్యానినాదశ్రవణాత్సు
రాణాం చేతాంసినిర్ముక్త భయానిసద్యః భవంతిదైత్యా శని
బాణవర్షం శార్ఙ్గంసదాహం శరణంప్రపద్యే ॥ ౧౮ ఇమంహరేః
పంచమహాయుధానాం స్తవంపఠేద్యోనిదినంప్రభాతే సమస్త
దుఃఖాని భయానిసద్యః పాపానినశ్యంతిసుఖానిసంతి ॥ ౧౯ వనే
రణేశత్రు జలాగ్నిమధ్యే యదృచ్ఛయాపత్సుమహాభయేషు
వనేదినేస్తోత్రమనా కులాత్మా సుఖీభవే తత్కృపసర్వరక్షః ॥
౨౦ నమస్సర్వగీర్వాణ కోటీరకోటిస్ఫురద్రత్ననిర్యత్న సదాం
జితాంఘ్రి శరచ్చంద్రకోటి ప్రభాభాసురాంగం నమస్కుర్మహే
వీరలక్ష్మీనరసింహ్వాం ॥ ౨౧ సభాస్తంభ నిర్భేదనావిర్భవంతం
ధ్వనస్తంభితాశేషదం భోళికేళిం ప్రచండ స్ఫురత్కాండ
ఖండాట్టహాసం నమస్కుర్మహావీరలక్ష్మీ నరసింహ్వాం ॥ ౨౨

చలచ్చంచలాకార చంచంనభాగ్రం జ్వలత్కాలకీలాలనా భీల నేత్రం మహోదగ్రదంష్ట్రాకరాళోగ్రవక్త్రం నమస్కుర్మహే వీరలక్ష్మీనరసింహ్వాం ॥ ౨౩ హిరణ్యాక్ష రక్షోగణాధ్యక్ష వక్షస్థల క్షోదదక్షోదజాగ్రం నఖాగ్రంపరస్పర్ధ దైత్యేంద్ర మత్తేభసింహం నమస్కుర్మహే వీరలక్ష్మీ నరసింహ్వాం ॥ ౨౪ కిరీటోల్ల సద్రత్న దేదీప్యమానం స్ఫురత్తారహారావళీ చారు కంఠం క్వణత్కంకణ స్వర్ణ కేయూరహారం నమస్కుర్మహే వీర లక్ష్మీనరసింహ్వాం ॥ ౨౫ రమావక్త్రపూర్ణేందు సందర్శనైక ప్రశాంతచ్ఛటాటోప కోపోపవేశం సమస్తామరస్తోమసమస్తూయమానం నమస్కుర్మహే వీరలక్ష్మీనరసింహ్వాం ॥ ౨౬ త్రయీమస్తకన్యస్త సీమంతరత్నం మహాయోగి హృత్పుండరీకద్వ్యరత్నం పవిత్రీకృత లోకత్రయం దేవరత్నం నమస్కుర్మహే వీరలక్ష్మీనరసింహ్వాం ॥ ౨౭ విపన్నప్రపన్నార్తి విచ్ఛేదహేతుం రుషశ్రీకృత ప్రాకృతాత్మావతారం తతో నిర్వికల్పం నిరాకార మేకం నమస్కుర్మహే వీరలక్ష్మీనరసింహ్వాం ॥

## విజ్ఞాననౌక

౨౮ తపోయజ్ఞదానాదిభిః శుద్ధబుద్ధిర్విరక్తో నృపాదౌపదే తుచ్ఛబుద్ధ్యా పరిత్యజ్యసర్వం యదాప్నోతితత్వం పరంబ్రహ్మ నిత్యంతదేవాహమస్మి ॥ ౨౯ దయాళుంగురుం బ్రహ్మనిష్ఠం ప్రశాంతం సమారాధ్యభక్త్యా విచార్యస్వరూపం యదాప్నోతి తత్వం నిధిధ్యాస్యవిద్వాన్ పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౦ యదానందరూప ప్రకాశస్వరూపం నిరస్తప్రపంచం పరిచ్ఛేదసూన్యం అహం బ్రహ్మవృత్యేకగమ్యం తురీయం పరం బ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౧ యదజ్ఞానతో భాతివిశ్వం

సమస్తంప్రసిష్టంచసద్యో యదాత్మప్రభోధే మనోవాగతీతం విశుద్ధం విముక్తం పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౨ అనంతం విభుం నిర్వికల్పం నిరీహం శివంసంగహీనం యదోంకార గమ్యం నిరాకారమత్యుజ్వలం మృత్యుహీనం పరంబ్రహ్మనిత్యం దేవాహమస్మి ॥ ౩౩ నిషేధేకృతేనేతినేతీతివాక్యైః సమాధి స్థితానాం యదాభాతిపూర్ణం అవస్థాత్రయాతీతమద్వైతమేకం పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౪ యదానందలేశైః సదానందవిశ్వం యదాభాతి చాన్యత్తదాభాతిసర్వం యదా లోచనే హేయమన్యత్సమస్తం పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౫ యదానందసింధౌ నిమగ్నః పుమాన్స్యాదవిద్యా విలాససమస్తప్రపంచం తదానస్ఫురత్యద్భుతం యన్నిమిత్తం పరంబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ ౩౬ స్వరూపాను సంధాన రూపాంస్తుతిం యఃపఠేదాదరాద్భక్తి భావాన్మనుష్యః శ్రుణో తీహంవానిత్యముద్యుక్త చిత్తోభవేద్విష్ణురత్రైవ వేదప్రమా ణాత్ ॥ అహం బ్రహ్మాస్మి ॥

## గురుపాదుకాస్తోత్రం

౧ శ్రీ సమంచితమవ్యయం పరమప్రకాశమగోచరం భేదవర్జితమప్రమేయమనంతమాద్యమకల్మషం నిర్మలంనిగమాంత మవ్యయమప్రతర్క్య మబోధకం ప్రాతరేవహిమానసాంతర భావయేద్గురుపాదుకాం ॥ ౨ నాదబిందుకళాత్మకం దశనాదభేద వినోదకం మంత్రరాజవిరాజితం నిజమండలాంతర్భాసితం। పంచ వర్ణమఖండమద్భుతమాదికారణమచ్యుతం ప్రాతరేవహిమాన సాంతర భావయేద్గురు పాదుకాం ॥ ౩ వ్యోమవద్బహిరంతర

స్థితమక్షరం నిఖిలాత్మకం కేవలం । పరిశుద్ధమేక మజ నమహాప్రతి రూపకం బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతానుమోక్షసుబోధకం ॥ ప్రాతి రేవ ॥ ౪ బుద్ధిరూప మబుద్ధికం త్రితయైకకూటనివాసినం నిశ్చలం నిరతప్రకాశకనిర్మలం నిజమూలకం । పశ్చిమాంతర ఖేలనం నిజపూర్ణ సంయమిగోచరం ॥ ప్రాత రేవహి ॥ ౫ హృద్గతం విమలం మనోజ్ఞవిభాసితం పరమాణుకం। నీలమధ్యసునీలసన్నిభ మాది బిందునిజాంశుకం । సూక్ష్మకర్ణికమధ్యమస్థిత విద్యుదాది విభాసితం ॥ ప్రాత రేవహి ॥ ౬ పంచపంచహృషీక దేహమనశ్చతుష్క పరస్పరం। పంచభూతక కామషట్క సమీరశబ్దముఖేతరం। పంచకోశగుణత్రయాది సమస్తధర్మవిలక్షణం ॥ ప్రాత రేవహి ॥ ౭ పంచముద్రసులక్షదర్శనభావమాత్ర నిరూపణం। విద్యుదాది భగద్గతత్వ రుచిస్వానోదవిజృంభణం । చిన్మయాంతరవర్తినం విలసద్విలాసమయాయికం । ప్రాతిరేవహిమాన ॥ ౮ పంచవర్ణసుచిత్ర విశుద్ధతత్త్వవిచారిణాం చంద్రసూర్యచిదగ్నిమండలమండితం ఘనచిన్మయం చిత్కళా పరిపూర్ణమంతర చిత్సమాధినిరీక్షణం ॥ ప్రాతరేవహి ॥ ౯ హంసచారసుఖాదినాదమనేకవర్ణమరూపకం శబ్దజాలమయం చరాచరజంతు దేహనివాసినం । చక్రరాజమనాహతోద్భవమేకవర్ణమతఃపరం ॥ ప్రాత రేవహి ॥ ౧౦ జనకర విలీనకారణ హేతుభూత మభూతకం జనకర నివారకం రుచి పూరకం భవతారకం। నామరూపవివర్జితం నిజనాయకం శుభదాయకం। ప్రాతరేవహి ॥ ౧౧ తప్తకాంచనదీప్యమానమహాణుమాత్రసురూపకం। చంద్రికాంతరతారకైరవముజ్జ్వలం పరమాస్పదం॥ నీలనీరద మధ్యమస్థిత విద్యుదాదివిభాసితం॥ ప్రా ॥ ౧౨ స్థూలసూక్ష్మసకారణాంతరఖేలనం పరిపాలనం విశ్వతైజసప్రాజ్ఞ

చేతసమంతరాత్మ నిజాంశుకంసర్వకారణమీశ్వరం నిటలాంత రాళవిహారకం ॥ ప్రా ॥ ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్య విరచితం శ్రీమద్గురు పాదుకా స్తవం సంపూర్ణం ॥

౧ ఎవ్వనిచేజనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై ఎవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూల కారణం బెవ్వ డనాధి మధ్యలయుడెవ్వడు సర్వము దానయైనవాడెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.

౨ రామ బ్రహ్మానందరసం రామనామసుధారసం రామపాదాం బుజరసం నిరంతరం కృతజిహ్వా.

౩ రామం శ్యామాభిరామం రవి శశి నయనం కోటిసూర్య ప్రకాశం దివ్యం దివ్యాస్త్ర పాణిం శరముఖ శరదం చారు కోదండహస్తం కాలం కాలాగ్నిరుద్రం రిపుకులదహనం రుద్ర దిచ్ఛేయదీప్తం భీమం భీమాట్టహాసం సకలభయహారం రామదూతం భజేహం ॥

౪ రాముడు ఘోరపాతకవి రాముడు సద్గుణకల్పవల్లి కారాముడు షడ్వికార జయరాముడు సాధుజనావనావ్రతోద్దాముడు రాముడే పరమదైవముమాకని మీాయడుంగు కెందామరలే భజించెదన్ దాశరధీ ॥

౧ ఉపాసన: మొదటనామమును పెదవులుకదిలించుచూ లెక్కించుచూ అనేకవేలు జపంచేయవలెను. ఆజపంచేయుస్థానం అలికి ముగ్గిడి ఆ గదిని అనేకవిధములుగ అలంకరించుకొని మంచి

సువాసన ద్రవ్యములు అనగా పుష్పములు, గంధం, ఊదొత్తులు వెలిగించియు వుంచుకొని తన యిష్టదేవతారూపమును (సాత్విక వృత్తులుపుట్టుటకు ప్రకిగోల్పు ఆకారముగానే యుండవలెను) కంటికెదురుగానుంచి గంధపుష్పాదులతోను ధూపదీపనైవేద్యాదులతో పూజించి మెత్తనివస్త్రములనుపరచి దానిమీదకూర్చొని ఆ దేవతానామమునే ఉచ్చరించుచూ దాని అర్థమును తెలుసుకొని దానిశక్తినితానుపొందినట్లు భావించుచూ చేయుచుండవలెను. అట్లు చేయునప్పుడు కండ్లతో ఆరూపమును తేరిపారి బాగాచూచుచు చప్పున కండ్లుమూసికొని ఆ రూపము మనస్సులో చూచుకొనవలెను. ఆ పటములోనిరూపమును కన్పించకపోతే కండ్లు తెరచి చూడవలెను. అట్లు కండ్లు మూసుకోగానే పటములోనిరూపము కన్పించేవరకు చేయుచుండవలెను రూపము కన్పించిన ఆ రూపమునేచూచుకొనుచూ మరొక విషయం వచ్చేవరకు కండ్లుమూసుకొని చూచుచుండవలెను. తిరిగి కండ్లు తెరచి తేరిపారి ఆ పటములోని రూపమునేచూచి కండ్లుమూసి ఆ రూపమునుమనస్సులోకన్పించుటేచూడవలెను. యితరవిషయం జ్ఞాపకమునకు వచ్చేవరకు ఆ రూపమునే చూచుచుండుము. రూపము స్పష్టముగా కన్పించుటకు వర్ణన చేయవచ్చును. ఒక్కొక్క అవయవమునుస్మరించుచూ ఆకారంఅంతా కన్పించేవరకు అట్లు ప్రత్యంగమును ధ్యానించవలెను. ధ్యానించినప్పుడు కన్పించకపోతే కండ్లు తెరచి ఆ పటములో చూడవలెను. ఇట్లు పదేపదే అభ్యాసముచేయవలెను. సాత్విక వృత్తులుకలిగిన మనుష్యుడైతే స్వల్పకాలములోనే, కొన్నిగంటలకే ఆ రూపం కండ్లుమూసికొనిచూచినా స్పష్టంగాకన్పించును

దుర్మార్గులైతే కొన్ని నెలలకైనా దుర్గుణములుకలవారలకు కొన్ని సంవత్సరములకైనా ఆ రూపము మనస్సుకు కన్పించదు కాని ఎంతటి దుర్మార్గులైనా గురువు అనుభవనీయుడైనయడల ఆయన మహిమవల్ల వెంటనే మనస్సుకు ఆ ఉపాసనాపటము లోని రూపము కన్పించును. యీ అభ్యాసాదులన్నియు చేసి ముగించిన గురువైతే అప్పటికప్పుడే స్పష్టముగా ధారణఅగును. ఈ అనుభవముదగ్గరనుంచి బ్రహ్మవిద్య ప్రారంభించి ఆ బ్రహ్మ నేనువరకుగలఅభ్యాసములన్నియు చేసినవారలైతేనే గురువుగా యుండవలెను.

2వ అభ్యాసము : అట్లు కండ్లుమూసి రూపమునుచూచు చుండగా ఆరూపము కన్పించకఉన్నప్పుడు యింకొకవృత్తి రానప్పుడు నున్న అనుభవమునుగుర్తించుచు చూచుచుండగా అంతలో ఏదోఒకవృత్తిరాగానే కండ్లుతెరచి ఆ రూపమును మళ్ళీచూచి కండ్లుమూసి వర్ణించుచు ఆ రూపమును స్పష్టముగా కన్పించులాగా చూచుచుండగా తిరిగి ఆరూపముపోయి మరొక వృత్తి రాకుండానున్న సమయములో నున్న వస్తువునుగుర్తించు చుండవలయును. మళ్ళీ వృత్తిరాగానే మళ్ళీ లోగడచెప్పినట్లు చేయవలయును. ఇట్లు కొన్ని నిముషములు చేయుచుండగా మొదటిరోజుననే స్వరూపదృష్టి అనగా తన నిజస్వరూపము అంటే పరమాత్మస్వరూపము తనకుదర్శనముకాగలదు. సద్గురు కరుణతో మొదటి రెండవ అభ్యాసములు ఒక గంటలోనే పూర్తికాగలవు – సాధువృత్తిగల సాత్వికవంతునికిమాత్రము. అనుభవము సరియైనది లేనిది పరీక్షించుకొనవలయును. ఎట్లనగా

అభ్యాసకాలములో ఆవలింతలు కలుగును, త్రేపులు వచ్చును, మగత నిద్ర వచ్చినట్లుండును, జంటస్వరములు ఆడును, హంస, శ్వాసలు ఒక నిముషమునకు 15 లోగడ అగుచున్నవారికి 10, 8, 6, 2, ఇట్లు క్రమక్రమముగా తగ్గుచుండును. ఒక నిముష మునకు ఒక్కొక్క శ్వాసకూడాఅగును. రోమాంచము ఆనంద భాష్పములు, కండ్లు ఎర్రనగుట, గద్గదకంఠము, రెప్పలు నిముష మునకు 20 పర్యాయములు వాల్చువారలు 10, 5, 2, గాతగ్గు చుండును. నిల్పు నుద్దేశ్యముగాని అభ్యాసముగాని చేయకయే, హంసశ్వాసలు రెప్పలవాల్పుతగ్గుట మొదలైనవితగ్గుచుండుటయే, బాహ్యగుర్తులు. తరువాత తరువాత ప్రయత్నపూర్వకముగా హంసను శ్వాసను ఆప ప్రయత్నించుట దృష్టినిల్పు అభ్యాస ములు ఒకటితరువాత ఒకటి ఎంతకెంతకెక్కువ అభ్యసిస్తే అంత కంత ఎక్కువ కాలము నామరూపరహితానుభవకాలము అనగా రెండవ అభ్యాసములో కన్పించిన అనుభవములు కన్పించును. ఆ కాలమును ఎక్కువ వృద్ధిలోనికి తెచ్చుకొనుటకే యికముందు చేయు వివిధరకములైన అభ్యాసములుగాని కొత్త అనుభవ ములకుగాదు. యిట్లు అన్నానని మొదటిగంటలోనేనాకు పర మాత్మ దర్శనానుభవము కలిగిందిగదా యికనేను చేయవలసిన పనులులేవు యింకా వివిధరకములైన యోగాది సాధనలు అవ సరము లేదని గర్వించి అంతటితో వదలినవారలకుగాని ఆజన్మాం తము అనగా ఆ స్వస్వరూపానుభవము కలిగింది లగాయితూ మరణించువరకు ఏనిముషమునకు ఆనిముషము సద్గురుకటాక్షము కొరకు చేయవలసినపనులుచేయుచు దానికితోడు సద్గుణవ్రతుడై యుండగా మధ్యలో త్రుంచుకుపోయిన వారలకు ఇహాపరసుఖ

ములు కోల్పోయి అదివరకున్న నీచత్వముకంటే ఎక్కువ సంసారదుఃఖములు పొందుచున్నట్లు నా అనుభవములో పెక్కుమందిని చూచుచున్నాను. అనగా మొదట ఒకటి రెండు అనుభవములను నేర్పినగురువునువదలి తదితర గురువులను చేరినంత మాత్రాన అని అనుకొనకండి మరేమంటే మొదట చెప్పినగురువును వదలి మరొకమార్గమును నేర్పు అనగా అనుభవరహితమైన విగారణ దుర్వృత్తులను ప్రోత్సహించు నిబంధనలుగల విధులు అనగా కొన్ని ద్వైతా, అద్వైత, విశిష్టాద్వైత, బౌద్ధ, చార్వాకాది మతములుగల కొన్ని సాంప్రదాయకములలో మాంసమును తినిపించుట, మత్తుద్రవ్యము లనుభవింపజేయుట శుక్ల శోణితాదులు భక్షింపజేయుట మొదలైన విధినిషేధములు లేక చరించునట్లుచేయుట ఏ ఒక యింద్రియనిగ్రహము లేక చరించుచు యింద్రియజయమే లేక మనోనిగ్రహమంటూ వాసనకైనా లేక అహంబ్రహ్మాస్మి అను మహావాక్యమును విచారింపచేయుచు అతీత వాక్యమును ఉచ్ఛరింపజేయుచు ఒరులకు బోధింపజేయుచు సద్గుణసంపత్తి వాసనకైన అజ్ఞానుల పాటియైన లేకుండాయుండు గురువులను ఆశ్రయించినవారలు అర్ధముచేసుకొనవలయునే కాని మొదటిగురువును వదలినంతమాత్రానే భ్రష్టులగుదురని అర్ధము చేసుకొనకండి. మొదటిగురువుకంటే ఎక్కువ అనుభవనీయులైన అనగా ఎక్కువకాలము వాయుజయమః చేయువారలును ఎక్కువకాలము మనోజయము చేయువారలును (మనస్సుకు వృత్తులులేకుండా ఎక్కువకాలము నిలుపువారలును) దశేంద్రియ వ్యాపారములను ఎక్కువకాలము ఆపగల శక్తిసంపదగల వారలును ప్రాపంచిక ప్రతీతి ఎక్కువకాలము

తప్పింపగల అనుభవసియులైనట్టి వారలను ఎందరినైనను ఆశ్రయింప వచ్చును. గాని సంపూర్ణానుభవసియులైన గురువును మొదట ఆశ్రయించి కొంత అనుభవము కలిగించుకొన్నవారు అట్టి గురువును వదలి తక్కువ అనుభవముగల మరొకరిని ఏకారణాంతరములచేతనైన ఆశ్రయించినవారలకు భ్రష్టత్వము ఇహపర సుఖములను కోల్పోయినవారలై నీచజన్మ పరంపరలు కలుగుట సత్యము. వ్యభిచారభక్తులకు కలుగు ఫలమిదియే వ్యభిచారభక్తి అనగా పైచెప్పినవిధమంతయు ఒకేదేవుని ఆశ్రయించక ఒకే గురువుని సేవింపక అనేకమందిని ఆశ్రయించి ఉపదేశాదులు శుశ్రూషలుచేయుటయే వ్యభిచారభక్తి. ఒకటి రెండు అభ్యాసములు చేయుచుండగా ఆ దేవతారూపము తాను తలంచగానే కనిపించి (మనస్సునకుగాని స్థూల కండ్లకుగాని కనిపించి) మనము కోరినకోరికలు మనకు కావలసినశక్తి మనకు ఏదైనవిషయము సంశయము కలిగినప్పుడు దానికి తగిన సమాధానములు మొదలైనశక్తులు కనిపించుచుండును. యిట్టి స్థితినే దేముని సాక్షాత్కారము అని అనవలయును.

ఎంతెంతధారణ మనస్సునందు వృద్ధియగునో అంతకంత శక్తులు వృద్ధియగును. ఆశక్తికే తగినపనులు మాత్రమే కలుగును. ఒక నిముషము మనోయింద్రియములకు వృత్తిలేకుండా నిలుపగలశక్తి కలవాడు రాజ్యాధిపత్యము కావలయుననియే కోరిన ఆ సంకల్పసిద్ధి కాకపోగా భగవద్ద్వేషియై వారిఆగ్రహము నకు గురికావలసిన వారలగుదురు. కనుక తనశక్తి ఎంతకలదో విచారించి సంకల్పించుకొని కార్యసిద్ధి పొందుచుండవలయును

శక్తినిమించిన బరువును పట్టినప్పుడు ఆ బరువువస్తువు లేకపోగా నడుమో మెడో నొప్పిపట్టి విరిగిపోయినట్లు పది నిముషములు మనోయింద్రియాదులను నిలుపగలశక్తికల వారలకు కలిగే కార్యసిద్ధులు – ఒకనిముషము నిలుపగలశక్తి కల వారు సంకల్పించి కార్యానుకూలము గాకపోవుటయే గాక మనస్సుచెడి పిచ్చి ఎక్కవచ్చు లేదా బ్రహ్మహత్యాది పాప ములు చేసినవారి దోషములకు కలుగు శిక్షలు కలుగవచ్చు – లేదా భక్తిశ్రద్ధలు అభివృద్ధిగాక తిరిగి సంసారగాథలలో అనగా పుత్రాదిమోహములు వ్యభిచారాది దోషములు చేయ వలయుననే బుద్ధిపుట్టి చెడిపోవుదురు.

అందుకనేశక్తులుఉపయోగించరాదుఅనుట. జాగ్రత్తగా ఎక్కువశక్తిఉండి కొద్ది సిద్ధులనుపొందుచు ఈశ్వరత్వస్థితి అనగా నేమో గ్రహించుచుండుము. శక్తులను ఉపయోగించు కొనకపోయిన జీవుడు ఈశ్వరుడే అన్నప్పుడు అనుభవములేక పోయిన సంశయాదులవలన నష్టకష్టములు పొందును. అనగా గురువుమీద విపరీతార్థము తోచును.

గ్రామములోనుండు ఒక మనిషి రాజు ఒకడే అంటే ఎంత హాస్యాస్పదముగా తెలియనివారలకు ఉండునో తెలిసిన వారలకు రాజునకు ఉన్న స్థితిఅంతయు సామాన్యులకుకూడా ఉన్నవి గానితక్కువ మనకున్నవి ఎక్కువ ఆయనకుఉన్నవి గాని ఆయనకు ఉన్నవిఅన్నీ మనకుండుటచేత వారేనీవు నీవేవారు అన్న సమాధానపడుటయో తానుకూడా అట్టి రాజ్యాధి పత్యము పొందియో సమాధానము పరచుకొని గురుభక్తిని నానాటికిని వృద్ధి చేసుకొనుచుండును. శక్తి ఉపయోగపరచు

కొనలేని వారలకు ఎన్నివిధముల సమాధానము పరచవలయు నని ప్రయత్నించిన నిష్ఫలమగును. మనకు చిన్నస్థితినుండి పెద్ద స్థితివరకు ఆయా శక్తులనువాడి అనగా ఉన్నశక్తిలో 100 వ వంతుకు సఫలమయ్యేశక్తినే సంకల్పించి సిద్ధులుచూచుకొనుచు వచ్చిన మనలోని దైవత్వ స్వరూపము అనుభవములో తెలిసిన వారల మగుదుము. గాని కబుర్లతో నేను దేవుడనే అన్నంతమాత్రాన నిష్ఫలమగును.

శక్తికి మించిగాని శక్తిఅంతయు ఖర్చుఅవగా సంకల్పమే గాని కార్యసిద్ధులు కావలయునని సంకల్పించదు సిద్ధికాకపోయి నప్పుడు నిరుత్సాహము కలుగును. కార్యసిద్ధి అయినట్లయిన ఉత్సాహపడుము. కాని గర్వమునుమాత్రము కలుగనివ్వరాదు అది కల్గుచునేయుండును జాగ్రత్తగా కలుగనివ్వకుండా ఉండే పనులుచేయుము. అవి మనకన్నఎన్నోరెట్లు శక్తికలవారున్నారే అందులో మనశక్తి ఎంతమాత్రము మనమెంత వారలము అను మొదలైన విషయములను స్మరించుకొని గర్వమును అణుచు కొనుము.

అణిమాదిసిద్ధులు క్రమక్రమముగా కలుగుచుండుట అనుభవనీయము కావలయును. ఆజన్మాంతము ఉపాసననువిడువ రాదు. మొదటఅది 1 సగుణోపాసనగా కన్పించినను క్రమ క్రమముగా 2 నిర్గుణోపాసనగా మారును సగుణోపాసన నామ రూపాది సహితముగా మారును. నిర్గుణోపాసన నామరూపాది రహితముగానుండును. ఒకటి ఖండము రెండు అఖండము ఒకటి గుణసహితము రెండు గుణరహితము మొదలైన భేదముగా నుండుగాని ఎప్పుడూఉండియే తీరవలయును. ఒకరేణువుయందు

"చిత్తమేవహి సంసార స్తత్ప్రయత్నేన శోధయేత్" మొదలైన వియు "యస్మిన్ కాలే ద్వైతభానం నాస్తి నిద్రాపినాగచ్ఛతి తస్మిన్ కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి తత్సుఖం ఆత్మ స్వరూప మిత్యాత్మ నిశ్చయో మే ధృఢీభూయాత్" అని ప్రమాణములున్నవి.

జన్మ రాహిత్యము కాని కాకపోనీ మోక్షంరానీ రాక పోనీ ఎన్ని కష్టములున్నను మనోలయం అనగా మనస్సునకు వృత్తులు రానికాలము కొంచెముసేపు ఉన్నను వెంటనే కష్టము లన్నీ పోయి పరమానందసుఖము కలుగుచున్నట్లు అనుభవ ములో చూచుకొనవచ్చును. మళ్ళీ అనగా మనస్సు వృత్తుల లోనికి వచ్చినప్పుడు తిరిగి సంసారకష్టములు కలుగుకదా దాని వల్ల నిష్ఫలమే కలుగునని వేదాంతులు అనగా సద్గుణసంపద యైనా లేనివారు శిష్యులను భ్రమింపజేయుచున్నారు. అత్యాం తిక దుఃఖ నివృత్తి లేదనుచున్నారు. యిదియే యిప్పుడుఎక్కువ ప్రచారములో నున్నది.

ఉపాసనలోను యోగాది సాధనలోను చేయుచున్నప్పు డైనా మనస్సు నిర్విషయాకారవృత్తిఉండుట నిజమేనని ఒప్పు కొంటే అట్టి సమయములలోనున్న ఆనందానుభవము బాగుగా చాలాకాలము అనుభవించి ఆ ఆనంద స్వరూపవస్తువును (పర మాత్మను) గుర్తించితే ఎప్పుడు ఎప్పుడు స్మరిస్తే అప్పుడప్పు డల్లా తదాకారమగుచుండుట అనుభవనీయముకాదా! ఉ॥ ఒక వస్తువును చూచిన తరువాత ఆ వస్తువ సన్నికర్షణాలో లేనప్పుడు కూడా ఆ వస్తువును స్మరించగానే తదాకారమంతయు స్వంత ముగా కన్పించునే! ఎప్పుడో చూచినవస్తువు స్మరించినంత

మాత్రిన, కొన్ని స్మరించకయే, అప్రయత్నముగానే స్ఫురణ లోనికి వచ్చుచుండ సర్వ ప్రపంచకములోను నిండి, నిబిడీకృత ముగానున్న వస్తువును సమాద్యాదులలో చాలాసేపు చూచి దానియొక్క స్థితిగతులు అన్నియు ఆమూలాగ్రముగా పరిశీ లించి అనుభవము సంపూర్ణముగా పదేపదే చూచిన వస్తువను భవము మనస్సు సంకల్పాదులలో నున్ననేమి ఏ యింద్రియము ఏవ వ్యాపారములు చేయుచున్ననేమి, ఆవస్తువుస్ఫురించుటకు ఏ ఆటంకము లేక యింద్రియాదులతో పనే లేకుండా తాను తనను చూచుటకు మరియొకరి సహాయ మవసరమేమి?

అవసరమైతే అన్నియు సిద్ధమేకదా! ఎక్కడికి పోవలె? ఏమి చేయవలె? అన్ని అన్ని చోట్లా కలవుకదా! ఎప్పుడు నిగ్రహము కావలయునంటే తనకు అప్పుడే నిగ్రహాదులు కాగలవు. నశించని, మారని,తనస్వరూపమును ఒక పర్యాయము దర్శించు టకు మొదట ఆయాయింద్రియాదులు గల్లంతులేకుండా నిశ్శబ్ద ముగా నుండవలయుగాని తరువాత అంత కష్టము అంత అభ్యా సాదులు లేకయే స్మరించినంతనే ఆ పరమాత్మ దర్శనము తనకు కాగలదు. ఆ స్థితిలో తనకు ఆ పరమాత్మకు భేద మొకింతైనను లేదని అనుభవముతో తెలిసికొనే యున్నాడు.

ఆశక్తులు కొద్దిగనో గొప్పగనో పొందిఅనుభవించుచునే యున్నాడు. సర్వప్రపంచకములోను నామరూపరహితముగాను నామరూపసహితముగానుఅంతాఆపరమాత్మయేననిఅనుభవ సిద్ధ ముగా విచారించి ఏ నిముషమునకు ఆనిముషముపదేపదేచూచు చున్న(కన్నులతోకాదుఅంతర్దృష్టితో సర్వేంద్రియములతోను) ఆపరమాత్మను మనస్సు విషయాకారము పొందినంతనే ఎట్లు

మరువగలడు. సరే మరచినను తిరిగి జ్ఞప్తికి తెచ్చుకోవలయు నన్నరాదా? యింతమాత్రానానే ఆ అభ్యాసాదులవల్లమోక్షము లేదనికాని జన్మరాహిత్యము కాదనికాని అన్నంతమాత్రాన అనుభవసీయులైన వివేకులైనవారలను నమ్మి వారిని అనుగ మించుట ఎట్లుజరుగును? నాతో చాలామంది వాదించియున్నారు వారికి పై విధముగా జెప్పినను ఆఖరుకు ఆ సమాధిస్థితిలో మనస్సు నివృత్తి ఆకారము పొందదన్నారు. ఆ సమాధ్యా దులు వారుచేసి అనుభవములేసి వారగుటవల్ల అట్లనిరి. శాస్త్ర ములలోను అనుభవములలోను అనుభవసీయులైన గురువుల వల్లను వేదాంత శాస్త్రములలోను సమాధిలో మనో యింద్రి యాదులు వాటివాటి వ్యాపారములుమాని "సింగమునుజూచి గజములభంగి" ఉండునని చెప్పినది అబద్ధమనెదరా యిట్టి కుత్సిత వేదాంతులవలననే వేదాంతమంటే సిగ్గుచున్నది. వేదాంతులు అనగా దుష్ప్రవర్తనే వేదాంతమనేకాడికి అట్టి వారలవలననే కలగెను.

"నిరంతరాత్మాను సంధాన వశాన్మనసోవృత్తి రూప పరి ణామ పరిత్యాగే నాత్మ పరిణామో దృఢీభూయాత్" "మనో వ్యాపారభావ సమయే యత్సుఖం భాసతే తత్సుఖం ఆత్మస్వ రూపమితి ఆత్మనిశ్చయోమే దృఢీభూయాత్" అనెడి వాక్య ములలోనున్న అనుభవమేమి? యిదేకదా ఏది ఎట్లు ఎవరుచెప్పి నను మనో యింద్రియాదులు స్వవశీకరములో ఉంచుకొనగల శక్తి ఏవిధముగానైనను పొంది నిజవస్తు దర్శనానుభవము కలి గించుకొనుటయే ముఖ్యము. అది ఏఏపనులు ఏఏ సాధికలు చేస్తే కలుగునో అనగా కొందరికి జపం మానసికముగా చేయు

చుండునప్పుడున్నూ మరి కొందరికి వాయుధారణతో కూడిన యోగముచేయుచున్నప్పుడున్నూ కొందరికి విచారణ చేయు చున్నప్పుడున్నూ కలుగుచుండును. ఏమిచేసిన మనో యింద్రి యాదులు వశీకరమగునో అదియే ఫలము.

మనో యింద్రియాదులు వ్యాపారములో నున్నను స్వస్వ రూపమును చూచుటకు ఏ ఆటంకములు లేవని వ్రాసినందున దుర్విషయములు చేయుచున్నా వుండే అనుభవమునకు యింకా సద్విషయములే చేయవలయునని విధి అవసరమైనట్లు కిన్పించదు కాని దానిభావము యిది. స్వరూపనిష్టకు అనగా తననుతాను చూచుకొనుటకు అడ్డములులేవు కాని సంసారదుఃఖములు జన్మ పరంపరలు పాపపుణ్యములు స్వర్గ నరకములు విధి నిషేధములు నిగ్రహానుగ్రిహములు చంచలా చంచలములు మొదలైనవి ఎవరికి? తనకా? పరమాత్మకా? తను పరమాత్మ రెండుకాదు, వారిద్దరికి పైవి ఏకాలములోను లేవు వున్నాయనుకొన్నా లేవు సూర్యునికి చీకటి యున్నదనుకొన్నంత మాత్రిన కలుగునా? అట్టి జీవాత్మ పరమాత్మలకు పైవియున్నా యంతమాత్రిన కలుగునా! ఎప్పుడూ కలుగలేదు, కలుగబోవు, కలుగవు. కాన మరెవ్వరికి? తెలుసుకొన్నప్పుడుకాని తెలియనప్పుడు కాని పై విషయమంతయు మనోయింద్రియాదులకేగదా (మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః బంధాయ విషయాసక్తముక్తై నిర్విషయం స్మృతం) (సర్వసంసారమును మానసమునమండు సర్వ సంసారమును మానసమున నడగు. సర్వసంసారమును మానసమానసముననొదగు,సర్వసంసారమును మానసంబెయగును) (చిత్తమేవహి సంసార స్తత్ప్రయత్నేన

సోధయేత్) (మానసమఖలంబువకు ప్రధానంబు) అను మొద లగు శృతి స్మృతులానుభవములనుబట్టి మానసేంద్రియాదులకే నని తెలుచున్నది. గాన స్వస్వరూప నిష్టానుభవము కలుగుట తెలికేగాని దానిని వృద్ధిచేసి నిల్పుకొనుటయూ, తర్వాత 2 మానసేంద్రియాదులు నిష్కల్మషమైన స్థితిలోనుంచుటయూ 3 వ్యాపారాదులలోగల పాపపుణ్యములు వాటికి అంటకుండా స్వచ్ఛమైన స్తితిలో నుంచుకొనుటకు సర్వదా ప్రయత్నము చేయుట అవ్రసరము. అట్లు చేయకపోయిన యడల మానసేంద్రియాదులు స్వరూప నిషలోనికి రానపుడుండు బాధలన్నియూ కలిగి బ్రహ్మ విద్యనిష్ఫలమగును అనగా చిత్తోపరతి వుండని వారికి తాత్కాలికసుఖము లేకపోవును. జపముచేయుచున్న కాలములో వైరాగ్యముకావలెను. ఆ జపకాలములో కలుగు చుండు అనుభవములను తెలుసుకొనుటకు బోధకావలెను. వాటిఫలము అనుభవించుటకు ఉపరతి కావలెను. యీమూడు ఎంతెంతవుండునో అంతంత సాక్షాత్సుఖము కలుగును. యీమూడుకలిసి ఆనందమగును. యీఆనందమే సత్తు, చిత్తు అనెదరు. సచ్చిదానందమే పరమాత్మస్వరూపం. గనుక స్వస్వరూపం తెలిసిన తర్వాతకూడా మానసేంద్రియాదులకు విషయతాకిడీలు తగులుకొనకుండుటకు చేయుప్రయత్నములు సర్వదాచేయుచున్నగాని సంపూర్ణ ఫలం అనగా పరిపూర్ణత్వము కలుగదు. (ధూమేనావ్రియతోవహ్ని యధాదర్శోమలేనచ యధోల్బేనావృతే గర్భస్థదా తేనే దమావృతం)(ఆవృతంజ్ఞానినే తేన, జ్ఞానినోనిత్యవైరిణాం కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేనచ) అన్నట్లు వ్యవహారికములో చేయు దుష్టసంబంధమైన క్రోధాధి ఆవేశములు దుష్టసహవాసాదులచేత మాన

సేంద్రియాదులు మలినవంతములగును. అట్టి మలములను ఏ రోజునకు ఆరోజు ఏగంటకు ఆగంట ఏనిముషమునకు ఆనిముషము శుద్ధి చేయనట్లయిన మట్టిపెంకుమీాద పడిన సూర్యకాంతి ప్రతిఫలించనట్లు ఆత్మస్వరూపాను సంధానమునకు ఎంతయో అడ్డమైనట్లు అనుభవసిద్ధమేగదా! ఆత్మానుసంధానము మనసు అహంకారాదులుచేయుచుండగా మానసేంద్రియాదులు కామ క్రోధాద్యావేశములు లేకుండా స్వచ్ఛమైనవిగా నుండకపోయిన స్వస్వరూపానుసంధానము కలుగనే కలుగదు. స్వరూపనిష్టకు ఫలం చిత్తోపరతియే స్వరూపనిష్ట తెలిసినతర్వాత అనగా బ్రహ్మ స్వరూపమునేనే, సర్వం యేదియెట్లు కన్పించినా ఆత్మేగాని యితరంగా యేమియూ కించెత్తైనా లేదనే దృఢభావన ప్రతినిముషము తోచుచుండుటయే స్వరూపనిష్ట. యిట్టివాడు ఆజన్మాంతరంవరకు మానసేంద్రియాదులకు దుర్మలములు అంటకుండా చేసుకొనుటకే ప్రయత్నపూర్వక, వాయుధారణ, మనోనివృత్తి ఇంద్రియాదులతో సద్వ్యాపారాదులు, జపములు, ధారణ, (సగుణ, నిర్గుణములు, సాకార, నిరాకారములు) సత్సహవాసాదులు అతిముఖ్యముగా చేయుచుండవలెను.

స్వస్వరూపాను సంధానము పొందుట ఒక గంటలో కలిగించిననూ మిగతాపనులు స్వభావసిద్ధముగా నిల్చుటకు చేయు ప్రయత్నములు చాలాకాలము పట్టును. కొన్ని జన్మలు కూడా పట్టును. ఇవి లేకపోవుటే భ్రష్టత్వమునకు హేతువులగును. గనుక గాఢమైన పట్టుదలతో అభ్యాసములు, నిష్టలు ఎక్కువ తీవ్రముగా చేయుచుండవలెను. (శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం) అనగా స్థూల సూక్ష్మశరీరములు

సంపూర్ణ ఆయురారోగ్యాదులతో నుండుటకుమాత్రం చేయు పనులు చేసినను పాపము అంటదు.

దీని అంతకూ సద్గురుకటాక్షమే కారణము. ఎంతకష్టించి చేసినా భగవత్కటాక్షముకొరకు చేయవలసినపనులు చేయక పోయిన యెడల యే అనుభవమున్నా కలుగనేరదు. (దుర్లభో విషయత్యాగో, దుర్లభో తత్వదర్శనం, దుర్లభో సహజావస్థ సద్గురోః కరుణాంవినా) అన్నట్లు భగవత్కరుణే గురుకరుణ, గురుకరుణే భగవత్కరుణ రెంటికి భేదములేదు. విషయత్యాగము గాని యదార్థవస్తుదర్శనంగాని, సహజావస్థగాని గురుకటాక్షము లేనిదే కలుగనేకలుగదు. గనుక గురుకటాక్షము తనమీద కలుగుటకు చేయవలసిన శుశ్రూషాదులు చేయుచునే యుండ వలెను. శరీరంతో గురుస్థూల శరీరానికి సేవ చేసినంతమాత్రం చాలదు. సేవ చేయునపుడు మనసునకు యితరవృత్తులు రాకుండా సేవచేయు వృత్తినిమాత్రమే భావించుచుండవలెను. సంశయములు కలిగి సేవ చేసినట్లాయెనా ఎంతమాత్రము వుపకరింపకపోగా అపకారముకూడా కలుగును. గనుక భిన్నభావనను వదలి త్రికరణశుద్ధిగా చేయవలెను.

గురువుకంటె వేరేదైవము లేడనేభావనచేత శుశ్రూషలు చేయవలెను. గనుక యీగురి ఒక్కటిచేతనే పూర్ణస్థితి కలుగుననుట అతిశయోక్తి కానేరదు. గనుకనే (గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః) అని వున్నది. ముక్తియన, మోక్షమన జీవన్ముక్తియన, జన్మరహితత్వమన, దేవుని దర్శించుటయన, జ్ఞాన

మన సమాధి మొదలైనపదములు అనుభవమున సర్వశాస్త్రములు పరిశీలించి తేల్చుకున్న విషయమిది.

మనోయింద్రియాదులు వాటివాటి వ్యాపారాదులు చాలించి అనగా చిత్తైకాగ్రతగా నున్నప్పుడున్న ఆనందము శరీరేంద్రియములనుండి విడివడిపోయినట్లుండి శరీర సుఖదుఃఖములు తోచని తెలివిగల సమయమే ముక్తిస్థితియని, ఆ స్థితి అన్ని అవస్థలలోను అనుభవించుటేయని సిద్ధాంతపరచుకొని నమ్మినవారలకే యీ పుస్తకములోని అభ్యాసాదులు సరిపోవును.

యోగాభ్యాసము: ఇక్కడ యోగాభ్యాసమనగా చిత్తేంద్రియములు వాటివాటి వ్యాపారములు చాలించుటకు చేయు పనికే యోగమని వుద్దేశించబడెను. యోగములు అనేక రకములున్నవి ఉ॥ జ్ఞానయోగము, కర్మయోగము, భక్తి యోగము మొదలైన 18 రకములుగా గీతలో పేర్లు పెట్టబడెను వాట్ల వుద్దేశము వేరైయుండవచ్చు. యిక్కడ వుద్దేశము మాత్రము మానసేంద్రియముల యొక్క వ్యాపారములను జాగ్రదవస్థలో కొన్నిగంటలు, కొన్ని రోజులు, కొన్ని నెలలు ప్రతి నిముషము అనగా వ్యాపారములు చేయుచునూకూడా వ్యాపారములు చేయనపుడున్న స్థితిని కలిగియుండువరకు ఆపుటకుచేయు సాధనలలో సులువైనది సుఖమైనది వాయుధారణ మాత్రమే! యింతకన్న వేరుమార్గములవల్ల పై అనుభవఫలం కలుగనేకలుగదని త్రికరణశుద్ధిగా అనుభవసియ్యులైన పెద్దలు చెప్పకతప్పదు. వేరుమార్గములనగా తీర్థయాత్రలు, వ్రతములు దానములు, వేషభాషలు, మహావాక్యాదుల జపములు, విచారణలు, తర్కములు మొదలైనవని అర్థము. గనుక వాయు

ధారణచేయు పద్ధతులను చేయునప్పుడు అనుభవనీయులైన పెద్దలకడనే చేయవలెనని మరువకుడి. పుస్తకములుచూచి చేయువారు సిద్ధి పొందలేరు. అట్లు చేసినయెడల చేయకుండా వున్నప్పుడు నష్టంకంటె ఎక్కువనష్టం కలుగును. యిందుకు మొదటినిభంధనలు 1 ఆహార పానీయ విహారాదులు ఎక్కువ మితముగా వుంచుకొనవలెను.

ఏంతెంతఏఏయింద్రియమునకుఏఏవిషయముఅవుసరమో అంతకంటెతక్కువగా వుంచుకొను చుండవలెను. అన్ని విషయములు ఎక్కువమితంగానే స్వీకరింపవలెను. 2 అధమం ఒక గంటయైనా మొదటఎట్లు కూర్చున్నారో కదలక అట్లే నడుము నిక్కించి మెడ తల వంకరటింకర లేకుండా కాళ్లు చేతులు కదల్చక కూర్చొనగలశక్తి సంపాదించవలెను. యీ రెండు అభ్యాసములు పూర్తిఅయినతర్వాత ప్రాణాయామము అభ్యసించవలెను.

మంత్రమును మనస్సుచేత అనుట నేర్వవలెను. అనగా పెదవులు నాలుక కదల్చక నామమును అనుటే (స్ఫుటంగా చెవులకు నామం వినిపించవలెను) మానసికజపం. 4 మంత్రములు మనసుచేత అనునంతకాలం ముక్కుతో గాలిని పీల్చిన కాలం (పూరకమందురు.) 8 మంత్రములు అనునంతకాలం వాయువునునిల్పి (కుంభించుట) 6 మంత్రములు అనునంత కాలము వాయువును వదలుట (రేచకమందురు.) యీప్రకారం 1 వారంరోజులు తడవకు 1 గంటసేపు లేదా 80 సార్లు పై చెప్పినవిధముగా అలవాటుచేయుటచేత తేలికగా శరీరముసడలి నట్లుండును. 2 వ వారంలో 1 మంత్రం మనసుతో అనుతంత

కాలం హెచ్చుచేసి అభ్యసించవలెను. ఈ ప్రకారం ఒకే వేళకు (నియమించుకొనిన వేళకు) మాత్రం అభ్యాసము ప్రతిరోజు తప్పక చేయుచుండవలెను. ఇట్లు 1 నెల నియమముతప్పక చేయుచుండినయడల 1 నిముషముకుంభకము (శ్వాసఆపుట) సిద్ధిఅగును లేదా 2 మాసములకైనా నీకుంభకము సిద్ధించును. ఈ ప్రకారం గంటలతరబడి శ్వాసను ఆపుశక్తి (కుంభకశక్తి) కలుగును. ఆమరణాంతము కుంభకవృద్ధి చేసుకొనుచుండవలెను. సోమరి తనముచే 1 నిముషం చాలు 2 ని॥ చాలు అనేతృప్తిని చెందకుడి. ఎప్పుడు చెందవచ్చునంటే విషయానుభవములువున్నంతలో తృప్తిని చెందగలశక్తి కలిగినతర్వాత ఇదికూడా 1 ని॥ తో తృప్తిని చెందవచ్చు. 1 రూపాయి సంపాదించువాడు 2 రూపాయలు సంపాదించవలె, గంజినీళ్ళు మెతుకులు తినేవాడు, పంచ భక్ష్య పరమాన్నములు తినవలెననే కోరిక, తాటాకుల గుడిసెలో నున్నవాడు పెద్ద పెంకుటి భవనములు కావలెననే ఆశ, కలిగివుండుట మంచిదే.

అభివృద్ధిలోకి పోవలెననేకోరిక శక్తికితగినట్లు ఆసించుట అన్ని విషయములలోనూ మంచిదేగాని దురాశ అనగా శక్తికి మించినఆశ వున్నంతలో తృప్తిజెందక తను సంపాదించలేని విషయములపై కోరిక దురాశఅనెదరు. యిది కూడదు. గనుక శ్వాసను కుంభించుటను క్రమక్రమముగా వృద్ధిచేయవలెననే సంకల్పముతోనే వుండవలెను. గాని 1 ని॥ ఆపితినిగదా చాలునని దీనికేనాతృప్తి. విషయానాంచాభివృద్ధి తత్ఫలప్రాప్తికై చేయు ప్రయత్నములు కొనసాగించుకొనుచుండ వలెనా? లేదా అభివృద్ధిపొందుట అన్నివిధములా అనగా ప్రాపంచికరీత్యా

గాని నిర్విషయకీత్యాగాని అభివృద్ధిమంచిదే సబబే సహజమే స్వభావమే అనవలె. సృష్టియొక్క స్వభావమే అనవలెగాని మానవకల్పితమే అనిగాని బంధహేతువనిగాని చెప్పవీలులేదు. కొద్ది సుగుణములుగలశక్తి గలవాడు గొప్పగొప్ప సుగుణములు గలిగినశక్తి సంపాదించవలెననే కాంక్షయూ, కొద్దికొద్ది సుఖములుగలవాడు పెద్దపెద్ద సుఖములను సంపాదించవలెననే ఆశయూ చెడువృత్తులుగలవాడు మంచివృత్తులు కావలెనసే కోరికయూ వుండుట సబబే ఎట్లోఅట్లే పైవికూడా అనగా అభివృద్ధిలోకి పోవలెననే కోరికయూ ఆశయూ మంచిదే అనవలెను ఆశ పిపీలికాది బ్రహ్మపర్యంతమూ వున్న జీవరాసులందునూ. అజ్ఞానిమొదలు బ్రహ్మవిద్వరిష్ఠుని ఆఖరువరకు అభివృద్ధికాంక్ష స్వభావముగా (ఎంతపోవాలని ప్రయత్నించినా పోనిది) వుంటూ వుండుటమన అనుభవసిద్ధమే. కన్పించుచున్నదేగదా? అట్టి ఆశను ఒక్క యోగాభ్యాసమునకుమాత్రం సోమరితనముచేత ఆశను కుదింపచేసుకొనుట అదిఒక పెద్దత్యాగమా? అన్నివిషయములనూ అభివృద్ధి చేసుకొనుచూ, కావలెననికోరుచూ అందుకై ప్రయత్నములు శక్తికిమించకుండా చేయుచూ అది అన్నియూ విధియుక్తములా? ఒక్క యోగాభ్యాసము మాత్రం వృద్ధిచేసుకొనుటకు ఆశవుండుట మంచిదికాదనుటయూ? యిట్లాగంటె విపరీతార్థములే చేసుకొని దానంచేస్తే జన్మవస్తుందిగనుక దానం చేయరాదని మొదలగు విపరీతబోధలలో యిదియొకటి యైయున్నది. స్వస్వరూపానుసంధానం అనగా పరమాత్మ స్వరూపానుభవము (విజ్ఞానము) సర్వకాల సర్వావస్థలయందు అనుభవసిద్ధముగా అనగా మాటిమాటికి, గంటగంటకు మనస్సు నిర్విషయాకారిక వృత్తినిపొందు మహనీయులు చెప్పినదే

సిద్ధాంతమనవలె. నమ్మి ఆచరించవలెగాని పుస్తకములలోవున్న విషయములు చదివిచదివి అట్టివారు వ్రాశిన గ్రంధములను సిద్ధాంతములుగా తీసుకొనకుడి.

పై చెప్పిన స్వరూపానుభవమునకు అడ్డు తగులని మలినము చుట్టుకొనని స్మృతికిరానివ్వని ఆరోగ్యము స్థూలశరీర మునకు కలుగుటకు ఆటంకము కలుగనివ్వని విషయములెట్టివి యైనను (మంచి, చెడులు) విధినిషేధములు లోకదృష్టిరీత్యాగా గాని శాస్త్రదృష్ట్యాగాని పుణ్యాపాపములు అభివృద్ధిలోకి తీసుకు రానలెనను కోరికవుండుట సహజమే సబబే సమ్మతమే అన్ని విధములా ఇది ఎట్టివారలకో అదిమాత్రం మరువరాదు. ప్రతి వారు అట్టివారుగానే ఉండవలెనని, అట్టిస్థితికే రావలెననికోరిక ప్రయత్నమున్ను గాని ఆస్థితి పొందుటకు మార్గములు పెద్దలవద్ద తెలుసుకొనక తనకుతోచినట్లెల్లా ఆ నిత్యానందసుఖము నిరతిశ యానందము, నిరుపాధికసుఖము, భార్యవల్లవున్నదేమో, పాడి పంటలలోనో, మేడమిద్దెలలోనో, సౌందర్యాదులలోనో, నగలు నాణ్యములలోనో, పుత్రాదులలోనో. దానధర్మాదులలోనో, యజ్ఞయాగాదులలోనో వున్నదనే నమ్మికతో పై విషయములను అనేకకష్టములుపొంది వాటిని సంపాదించి వాటిలో తనకుకావల సిన నిత్య నిరుపాధిక నిరతిశయానందసుఖము లేదని అనుభవ రీత్యా తెలుసుకొన్నతర్వాత వాటినన్నిటిని వైరాగ్యాది సాధ నలచేత వాటిమీద కాంక్షలువదలి అనుభవనీయులైన సద్గురువు వద్దచేరి వారుచెప్పినట్లు చేయగాచేయగా స్వస్వరూపానుసం ధానం కలిగెనని నిర్ధారణ అప్పుడుకలుగును. అప్పుడు తృప్తికలు గును. తన సహజకోరిక నిత్యనిరుపాధిక నిరతిశయానంద వస్తు

వును సంపాదించవలెననే పుట్టిందిమొదలు చచ్చువరకు కోరుచు
అది పై చెప్పిన విషయములలో నున్నదేమోనని కష్టించి సంపా
దించియూ నలుగురితోపాటు నారాయణాయన్నట్లు తానున్న
పరిసరములయందున్న వారందరు అదే చేస్తున్నారుగదాననే
తెలివి చేతగాని అట్లు ఆశించుచున్నాడు. తనకోరిక పుట్టిందిలగా
యతు చచ్చేవరకూ చేయు ప్రయత్నాదులెల్లను దానికొరకే
గాని (నిత్య. నిరుపాధిక, నిరతిశయానంద సుఖమును పొందవలె
ననే) వేరొండుకాదు. ఈకోరిక సహజముగా పిపీలికాది బ్రహ్మ
పర్యంతమూవున్న జీవరాసులన్నింటికి కోరికయైయున్నది. అది
కాని యితర విషయములన్నియు (అష్టైశ్వర్యములు) సంపా
దించియు వాట్లవల్ల తనకోరిక యీడేరే స్వభావము వాట్లల్లో
లేకపోగా, దుఃఖములుతోచుచుండుట, తనకు తోచుచుండియు
మళ్ళీమళ్ళీ వాట్లనే కోరి సంపాదించి లేదనే జ్ఞానముపొందియు
మరియొకత్రోవ వెదకుకొనలేక, వాట్లలోనే నిమగ్నుడై వుంచి
నదేమాయ. అజ్ఞానము, మహత్తు యెంతెంతవారలకైనా
మోసపుచ్చుచున్నదే యీమాయే. దీనినివిచారించితే లేనిదేగా.
మొదట తన కోరిక నిజమైనదే.

ఎన్నడూ తరుగని, విరుగని సుఖముగదా కావలెనని
కోరినది. అందుకేకదా, ఒకయింట్లో ఒక ధనమో, ధాన్యమో
యాగమునో, జపమునో చేసినది. ఆయా విషయములు సంపా
దించినపుడు ప్రతిది చాలాకాలంవుండవలె. చాలా తరుగని
సుఖమును యివ్వవలె అనే సంకల్పముతోనే. వాస్తు, జ్యోతి
షాది శాస్త్రజ్ఞులను విచారణలను చేసి చేసి మంచి ముహూర్త
ములో ఆపై చెప్పినపనులు ప్రారంభం లగాయతు, అంతం

వరకు అదే వుద్దేశముగాని, ఆ కోరికలు అవి యిచ్చెనా, యిచ్చునా, యివ్వగలవా అనే విచారణగాని, కోరిక విస్పష్ట ముగా తనకు తెలిసిగాని, లోకులు చెప్పగాగాని తనకు తెలి యకపోవుటయే అజ్ఞానము. ఈ అజ్ఞానము తొలగించువారే గురువులు. 1 సుఖము అత్యంతిక సుఖము 2 చిరస్థాయి అనగా మధ్యమధ్య నశింపులేనిది. 3 గొప్ప ఆనందము. వీటినే వేదము సచ్చిదానందములనెను గనుక తన కోరిక మొదటినుంచి సచ్చి దానందములను సంపాదించవలెననే ఇది తెలిసియో తెలి యకయో అందులకయ్యే ప్రయత్నించుచూ అది ఎందులో వున్నదో తెలియక వెదుకుచూ ఆయా విషయములను సంపా దించి విసికి వేసారి వాట్లల్లో కించిత్తైనా లేదనే అనుభవముకలిగి గురు కటాక్షమునుపొంది మనో యింద్రియాదులు లయము పొందినప్పుడుగదా ఆ ఆనందము కల్గుచున్నదని తృప్తిచెందేది.

ఇది కలిగినట్లాయెనా సమస్త కోరికలు, సమస్త ఆశలు తీరినవగును. సమస్తతృప్తులు కలిగినట్లగును. సమస్తసుఖములు కలిగినట్లగును.

ఇంతవరకు విషయములలో సుఖముగాని, ఆనందముగాని లేదని అభిప్రాయము వ్రాసితిని. అయితే యావత్తు జీవరాసులు ప్రాపంచిక విషయములు అత్యంతకష్టపడి సంపాదించుటెందు లకు? దుఃఖములు కావలెననియా?

సుఖముకావలెనని కోరుచూ దుఃఖమిచ్చె ప్రాపంచిక విషయములను కష్టపడి సంపాదించుటేల? ఎంత మూర్ఖుడైనా దుఃఖముకొరకు విషయములను సంపాదించునా? విషయా నందము వుంటేనేగాదా? ఆయా ఇంద్రియములకు కావలసిన

భోగములకొరకు ఆయా విషయాలను సంపాదించినది విషయములలో కూడా తనకు సహజముగా కావలసినవస్తువు (ఆనందము నిత్యసుఖము) వున్నదిగనుకనే ప్రాణమానధనములు ధారపోసి ప్రాపంచిక విషయములను సంపాదించుచున్నది. అట్టి విషయానందముకొరకైనా మనస్సు ఏ వృత్తులమీదకు పోకుండా నిశ్చలముగా వుంటేనే విషయానందమైనా కలుగుటకుమార్గము. కొన్ని కొన్ని విషయములలో మనసును ఎక్కువకాలము నివృత్తిగా వుండేటట్లు చేయగలశక్తి కలవిగావున్నవి. కొన్ని కొద్దికాలము మాత్రము నివృత్తినిపొందింపచేసే శక్తికలవిగా వున్నవి. ఆ నిశ్చల చిత్తైకాగ్రతే, తనకు కావలసిన బ్రహ్మానందసుఖము. దీనినే విషయానందమనెదరు.

ఆ విషయానందము కలిగించిన విషయములులేకుండా ఆనందము మాత్రం కలిగించుకొనినయడల అదే నిర్విషయానందమగును. ఆనందము కలుగుటకు మనోయింద్రియములు ఏకాగ్రతను పొందవలెను. గనుక విషయములద్వారా అనగా సగుణానందముద్వారా నిర్గుణానందానుభవమును గుర్తుపట్టి ఆవిషయం వదలి నిర్గుణానందమును అనుభవించుటే తన సహజకోరిక.

మానసేంద్రియములు ఏకాగ్రతను పొందింపచేయు విషయములనే ధారణపెట్టి ఆ ధారణ నిలిచినప్పుడుకలుగు ఆనందము బ్రహ్మానందానుభవ మయ్యేను. సామాన్యమానవులు అజ్ఞానులు మనోహరముగా నున్నదని విషయములతో చూచి అనెదరు. ఆపాట ఎంత మనోహరముగా నున్నది. ఆ వస్తువు తిన్నప్పుడు ఎంత మనోహరముగానున్నది అని జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లకు తోచు ప్రతి విషయమునకు మనోహరమని

వాడెదరు. మనోహరమనగా మనసు హరించుటగదా? ఆ ఆనంద మునకుమనసు హరించవలెను. అనగా మనోలయము కావలెను. ఆనందమెద్దియైనను, భగవత్స్వరూపమునకే కలదుగాని, విషయ ములకు లేదు. నిర్విషయానందమును పొందుటకే, విషయము లను అనేక నష్టకష్టాలు పొంది సంపాదించెదరు. అట్లు ప్రతి విషయాలలోను, మనోలయము కాగలిగినంత శక్తి ఆయావిష యములకు లేకుంటే ప్రతి విషయము మనోహరముగానుండదు అందువల్ల దుఃఖముగాకూడా వుండును.

మనో యింద్రియములు లయించేటంతశక్తిగల విషయ ముల ఆకార, గుణములుగలవిగా నుండునట్లు వాటిని మార్పు చేసుకొనవలెను. ప్రతివిషయములను మార్పుచేసుకొనుటలో కూడ మనోహరముగా నుండుటకు సహాయపడును. సచ్చిదా నందానుభవము కలుగుటకే ప్రతిజీవి, విషయములను సంపా దించును అవిమాత్రం కలుగుచుండెనో, లేదో మాత్రం విచా రించకుండా చేసినదేమాయ. ఈ మాయ పోవుటకు పెద్దలకడ విచారణచేసి, సచ్చిదానందాను భవము కలిగించుకొనుటే మార్గము.

తన స్వరూపానందానుభవమునకుమాత్రం భంగము కలిగించు విషయాలనుమాత్రం లక్షలాది కోట్లాది ధనము నష్టమైనా వదిలిపెట్టుచునే యుండవలెను. లాభము కలుగజేసే విషయములనైనా, స్వరూపదృష్టికి భంగము కలుగజేసేవైన యెడల వెంటనే వదిలిపెట్టుచునే యుండవలెను.

అయ్యో, యీ విషయంవదలితే, యీ నష్టమువచ్చు ననే చింత యేమాత్రం మొగమాటాదులు లేకుండా వదలే

తీరవలెను. అభ్యాసాదులు చేసేవారలకుమాత్రం ఆ వదలే శక్తి కలుగును. అభ్యాసములు చేసి వాట్ల స్వస్వరూపము అనుభవ విషయములను అనుభవించినవారలు పురోవృద్ధికి చేరి, తిరిగి ఆ వదలిన విషయాలనే (రాజ్యాంగాది వ్యవహారములలోకివచ్చి) స్వస్వరూపదృష్టిలో మనసును వుంచుకొని వృద్ధిచేసుకొనును నిజమైన బోధచేయు అనుభవనీయులైన యోగులు (వాయు మనోజయములు) ఎన్నడూ, ఏ విషయములనూ, వదలవలెనని చెప్పుటగాని, చేయించుటగాని లేకుండానే అట్టి స్థితిని కలిగించు టకు శక్తివంతులై యుందురు. ఎన్నడూ ఏవిషయమును వదల వలసిన పనిలేదుగాని, మితపర్చుకొనుట అవుసరంమాత్రముంచు ను. ఆ మితపర్చుకొనుట తన పురోవృద్ధికి భంగము కలుగనివ్వ కుండానే అన్ని విషయములందును వుండవలెను. మితపర్చు కొనుట అనగా విషయములను వదలుటకాదు.

తాను కోరిన సచ్చిదానందానుభవమునకు అడ్డు తగుల కుండా చేసుకొనుట మాత్రమే. గనుక స్వరూపదృష్టి ఉపాసన లోనే కలిగెను, దొరకెను, చూచెను. ఇకదానికభివృద్ధిఅయ్యే వాయుజయము, నానాటికి గంటలతరబడి నిల్పుటకు ప్రయత్న పూర్వకముగా చేయవలసినపని. గనుక అది అభివృద్ధి చేసు కొనవలెనని కోరిక తీవ్రత ఎక్కువ కావలెను.

ప్రతివిషయములలోను తక్కువ స్థితిలో నున్నవాడు ఎక్కువస్థితికి పోవలెనను ఆశవుండుట మంచిది. వుండతగినదే నని అభిప్రాయంపై విషయములనుబట్టి స్థిరపడుచున్నది. ఆఆశ యీశ్వర ధర్మములకు వ్యతిరేకముగనుండినట్లైన దురాశ అయివున్నదికూడ పోవును.

మనోవాయువులు సుషుమ్నలోనుంచి మూలాధారం గుండా ప్రవేశించి సహస్రారమునకుపోవునపుడు మన స్థిరత్వము (విషయములనువదలినస్థితి) కలుగుచుండగా స్వరూపనిష్ట తనంతనే కలుగుచుండును. ఇట్టివాడు వ్యవహారికములలో ఇంద్రియములు విషయవ్యాపారములు చేయుచున్నను, నిర్లిప్తస్థితి అసంగత్వస్థితి. ఏకర్మలు చేయలేదన్న నిరహంకారాభిమానములు లేనిస్థితి ద్వంద్వాతీతస్థితి(మానాభిమానములు కీర్తి, అపకీర్తులు, పుణ్యాపాపములు, జ్ఞానా జ్ఞానములు మొదలైనవి లేనిస్థితి) అకర్తృత్వస్థితి, జీవన్ముక్తావస్థ అనుభవములు కలిగి యిప్పుడే నిరుపాధికమైనట్లు తనకు కన్పించును.

వాయు వెంతకాలము కుంభకములో నిల్వగలశక్తి యుండునో, అంతకాలం కేవల నిర్వికల్ప సమాధియూ, వాయువు వుచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుచున్న కాలములో సవికల్పసమాధియు అనుభవములో కన్పించును. అనగా నిరంతర సమాధినిష్ఠయే అనగా సహజామనస్క రాజయోగ సమాధియే ఇప్పటి వేదాంతులన్నట్లు అభ్యాసకాలములోమాత్రం నివృత్తిగా వుండుట, తదితర కాలములలో బద్ధుడుగా అనగా వృత్తి సహితుడుగానుండుట మాత్రంకాదు. ఎల్లప్పుడు హంస తగ్గే నడుచును. అనగా 1 ని. కు 15 శ్వాసలు కావలసింది తగ్గేశ్వాస ఆడును. జీవన్ముక్తునికి యిది యొక బాహ్యాగుర్తు సుషుమ్నగుండా వాయు సంచారంచేయుచున్నవారుసహస్రారమునకు ప్రతిహంసను పోవుటయు, అక్కడ నిర్వికార, నిర్గుణ పరమాత్మను దర్శించే వచ్చుచూ పోవుచుండును. సుషుమ్న అంతయూ కేవల ఆత్మమయమే. దానిగుండా పోకుండానే

దానిని స్మరించినంతనే స్వరూపానందానుభవమే కలుగుచుండు ను. ఇదే నామస్మరణ. తత్ఫలము ఆత్మైక్యము. ఇట్టివారలకు "సర్వం ఖల్విదం బ్రహ్మ" మను వాక్యానుభవము కలుగును గాని, తదితర మార్గస్థులకు కలుగనే కలుగదని చెప్పుటకు వారి అనుభవములే, పనులే కన్పించుచుండును. చెప్పుటేగాని ఆత్మానుభవములేనివారని వీరినే అనుచుందురు.

సుషుమ్నామార్గయానమునే అర్చిరాది మార్గమందురు యీ మార్గస్థులకే పునర్జన్మలేదనవలెను. ఇప్పుడే నిరుపాధిక మగుచుండగా తిరిగి జన్మఎత్తుదురనుట ఎట్లు. వుపాధులలో వుండే లేనిస్థితి, ఫలం, అనుభవించుచుండెను.

జన్మలు, అహంకార, మమకార, కర్తృత్వములయొక్క-యు, కామక్రోధాది ఆవేశములుగలవార్లకే కలుగుచుండును. వాసనకైనా సుషుమ్నసంచారములేనివారలకు ఆడుద్రేకాదులు అణగవు. వీరికే బీజశక్తి అనగా చెట్టుఅయ్యేశక్తి విత్తనములో ఎట్లువుండి విజృంభించి, అనేక బీజాదులను కల్గించునో, అట్టి బీజశక్తి వేయించిన గింజలో ఎట్లు నశించునో, అట్లే అహం కారి గుణముల వుద్రేకము లేకపోయినయెడల నీచజన్మలు రాకుండా వుండేస్థితి అనగా జన్మరాహిత్యత్వము కలుగును. అయితే నీచజన్మలు రాకుండావుండేస్థితేగాని ఉత్తమ జన్మలు వస్తాయనేగా, అవును. జన్మరాహిత్యమంటే ఉత్తమోత్తమ మైన బ్రహ్మవిద్యానుభవముతో గూడిన ఉపాధులు వచ్చిననూ ఉపాధులులేనివారుగానే వారి నటనలో కన్పించును. ఇదియే మోక్షం. ఇట్టి యుపాధులను జన్మలెత్తుటఅనకూడదు. అట్లన్న యెడల శుకుడు, నారదులు, కపిలుడు, అత్రి, గౌతమాది మహ

ఋషులు, బ్రహ్మ, విష్ణు మహేశ్వరాది దేవాదిదేవతలు, ప్రహ్లాద, అంబరీష, రుక్మాంగదాదిభక్తులున్నూ, సరస్వతి, పార్వతి లక్ష్మి, సీత, అనసూర్య, అరుంధతి, అహల్య, సావిత్రి మొదలైన మహాపతివ్రతలు వీరికందరికి రామకృష్ణ పరమహంస, వివేకానంద, గోపాలకృష్ణగోక్లే వీరందరూ తిరిగితిరిగి అనేకసార్లు ఉపాధులను ఏదోవిధముగా అనగా దుష్టశిక్షణ శిష్టరక్షణకొరకు జ్ఞానబోధకొరకుగాని ఇతరులకు వరములిచ్చి ఆవరములు నెరవేర్చగలందులకుగాని దాల్చినట్లు ఆయా వుపాధులను అవతారములని, మహాఋషులని మొదలైన గొప్పగొప్ప నామములతో పిలుచుచూ ఉపాసనలు తత్వబోధలు చేయుచూ వారివల్ల జ్ఞానమార్జించి ముక్తులగుచున్నారనుట వినియుంటిమి. ఇప్పటికి పై అవుతారముల స్థూలశరీరములను వుపాసించి సిద్ధులుపొందుచున్నారు. గనుక జన్మలు ఉపాధులురావుఅని సిద్ధాంతముకాదు వచ్చిననూ అవిజన్మలెత్తుట అనరాదు. అవుతారములని సిద్ధులు అని మొదలైన పదములతో గౌరవనామములతో పిలువవలెను సృష్టిస్థితి లయములుచేయు ఆ పరమాత్మయే, "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అన్నట్లు ఏదోవిధముగా అన్నది ఇదేఅయివున్నది. సృజింపబడుచుండగా ఇక వీరువారననేల అందరూ సృజింపబడి తీరవలెను. జన్మలురావని శాస్త్రాదులలోవున్నదే అదేదన "మాముపైత్యతుకౌంతేయ పునర్జన్మనవిద్యతే" అన్నట్లు తిరిగి ఎన్నటికి నీచాతినీచజన్మలు అనగా విజ్ఞానరహితజన్మలు, సంసారదుఃఖానుభవ జన్మలు, అవినీతిప్రవర్తనతో వేదాంతవాక్యములను నోటితో వుచ్చరించుచూ వాటిప్రకారం ఆచరణలేనిజన్మలు (జ్ఞానపాషండులు అనగా జ్ఞా

వమే మోక్షమార్గంగాని వేరేమార్గములు మోక్షమివ్వవని) వాదించుజన్మలు ఇట్టిజన్మలురావుగాని మోక్షజన్మలు రావని కాదు.

ఇంద్రియనిగ్రహములేక దుర్విషయానుభవులుగనున్న జన్మలు మతాభిమానం, దేహాభిమానం, శాస్త్రాభిమానాది అభిమానగ్రస్తులుగా నున్నవారి జన్మలుమాత్రం రాకపోవుటయే, జ్ఞానయోగానుభవులకు వచ్చుఫలము. పైవి లేనిజన్మలు వుపాధులు జన్మలేకాదు. యిక్కడ ఇహలోకములోనే వారిని అవతారములని, దేవుడేనని, పరమాత్మేనని, రాజాధిరాజులుమొదలు నీచులతోసహా అందరు సేవించుచుందురు. దుఃఖము లేనిస్థితి స్వరూపస్థితేగాని అదిలేనిసమయము ఉండనేవుండదు. అట్టి ఉపాధితో గూడుకొనుట జన్మలుకావని అనుభవసిద్ధాంతమే.

సుషుమ్నకు మోక్షనాడియని సహస్రారమునకు బ్రహ్మరంధ్రమని పేర్లు వూరికేరాలేదు. అక్కడున్న అనుభవమును బట్టియే పేర్లు. ఆ స్థానానుభవులకే తెలియునుగాని తదితరులకు తెలియదు.

జన్మలు వచ్చుననేభయం అనుభవనీయులైనజ్ఞానులకు యోగులకు, భక్తులకు కలలోనైనావుండదు. అజ్ఞానులకు సుషుమ్నగాని దాని శాఖలుగాని చలనములేక వాటి వ్యాపారములు చేయకుండును. జ్ఞానులకు సుషుమ్న వెంట ఏదో పాకినట్లు స్పర్శకుగాన్పించును. వెన్ను తిన్నగా వుంచవలెననేబుద్ధి పుట్టుచుండును. వెన్ను వంకరగా పెట్టినప్పుడు సుషుమ్నసంచారులకు నొప్పి కలుగుచుండును. తిన్నగా పట్టగానేపోవును. జంట

స్వరములాడుచుండును. అనగా 2 ముక్కు రంధ్రములనుంచి శ్వాస సమానముగా బైటకు లోపలికి వచ్చుచు పోవుచుండును ముక్కులలోను, పొట్టలోని నరములలోను ఏ మలమును చేర నివ్వదు సరికదా అభ్యాసము (ప్రాణాయామము) తీవ్రముగా చేసినకొలది శరీరములోని నరములన్నియు మలరహితమై మంచి దేహారోగ్యము దేహకాంతియు కలుగుచుండును. కొన్నిశక్తులు కలుగును.

ఆశక్తులను ఇంద్రియ విషయములకు వాడుకొనకుండ మోక్షానుభవమునకు అనగా నిరంతరాత్మానుసంధానమునకు వుపయోగించుకొనినయడల శక్తి అభివృద్ధిఅగును. ఇంతకూ వాయుజయం కలుగజేసుకొను అభ్యాసములను చేయవలెను. 1 ని. వాయువునునిల్పగల (కుంభించగల) శక్తి సంపాదించి అంతటితో అఖండానందానుభవము కలుగగానే యింతటితోతృప్తి కలిగి ఆపరాదు.

ఒకగంట శ్వాసనుకుంభించగలశక్తి సంపాదించిన యింకా ఎంత ఆనందం అనుభవించవచ్చునో అని ఆశను అభివృద్ధి చేసుకొని ఉల్లాసపడవలెను. నిరుత్సాహపడకూడదు. రోజుకుపావలా సంపాదించిన కలిగే విషయసుఖమునకు 1 రూపాయి సంపాదించిన, 10 రు. సంపాదించిన ఆసుఖము ఎంత ఎక్కువగా అనుభవించవచ్చునో అట్లే 1 ని. కుంభించగలిగినప్పుడు వచ్చేఆనందం ఎన్నిరెట్లు ఎక్కువగా అనుభవించవచ్చునోగదా అని ఉల్లాసముతో కుంభకవృద్ధి చేసుకోవలెను.

ఇట్లువ్రాయుట చెప్పుట తేలికేగాని చేసి ముగించుట ఎంతకష్టమో చేసినవారలకే తెలియును. కబుర్లకు యోగంరాదు

కష్టించి అభ్యాసము చేయువారలకే వాయువు కుంభకమున నిల్చును. ఇదియే బ్రహ్మవిద్య అనవలెను. 1 ని. లో గల ఆనందమే 1 గంట కుంభకమున అనుభవించేఆనందము ఎక్కువ కాలం శ్వాసనుఆపినకొలది శక్తులు అభివృద్ధిఅగును. నేనుబ్రహ్మ విష్ణు రుద్రస్వరూపమునై తిని. అఖండశక్తిగల పరమాత్మనైతినని అనుభవనీయముగా అనుభవించవచ్చును. నేను ఒకతడవ 5 ని. లు వాయువును నిల్పగలశక్తి సంపాదించవలెనని హఠం పట్టగా 5 గంటలకు నిలుపగల సామర్థ్యంకలిగి కుంభించగలశక్తి కలిగెను. అంతకంటె హెచ్చు నిల్పలేకపోవుచుంటిని. కారణం అందుకుతగిన సాంగత్యాదులు అనగా ఎక్కువగాని అంతియగాని నిల్పగల మహనీయుల సహవాసములేక అభివృద్ధి అగుట లేదు. నేను 40 సం॥ రములనుంచి చూడనైనా చూడవలెనను కోరికయుండి అనేక స్వాములవారలను, భక్తులను, యోగులను అనగా ఆపేర్లుపెట్టుకొని పిలిపించుకొనుచున్న వార్లను, శ్వాసను 1 గంటసేపైనా ఆపగలశక్తి వున్నదా? అని అడుగగా 1 ని. మైనా ఆపగలశక్తి గలిగినవార్లుగాని, పోనీ మోక్షమునకు యోగం అనగా వాయుజయం అత్యంతఅవుసరమనిగాని చెప్పనైనా చెప్పువారినిగాని, చెప్పినా క్రియచేసిచూపువార్లనుగాని, కని విని ఎరుగను. నేనుకాదు చాలాప్రఖ్యాతి పేరుకుమాత్రం చెందిన మహనీయులనేకులతో 5 ని. లైనా వాయుజయంచేసిన వార్లను మీరుచూచి నాకుచూపించండని వినయ భయభక్తులతో వారినికోరి వెతకించితినిగాని యిప్పటికాలములో పైవిద్యను అభ్యసించువార్లు ముముక్షువులలోగాని తదితరులలోగాని లేనేలేరని చెప్పిరి. నేను చూచినంతలో నాకు తెలిసినంతలో

ఆసేతు హిమాచలము భక్తులను పేరుతోను, యోగులమను పేరుతోను, యతులమనే పేరుతోను, సంచరించుచున్నవారిని వాయు కుంభకముచేయు యోగమును చేయగలవారు గలరా? మేము చేయలేముగాని హిమాలయాలలో నున్నారు అక్కడికివస్తే చూపెదమని మొదలైన జవాబేగాని చేసినవారు లేకపోయె. తదితర సాంప్రదాయకులున్నట్లు అనగా భక్తులు వేదాంతులు (విచారణమాత్రం చెప్పుచు చెప్పినది చేయనివారు) సన్యాసులు యతులు మొదలైన వారనేకులున్నట్లు హఠయోగం చేయు వార్లు లేరు.

ఇప్పటికాలములో యోగము (వాయుధారణా యోగము) చేయువారలు లేనేలేరనవచ్చును. అవిద్య ఒక గారడి విద్యయని ప్రతీతి. ముముక్షుత్వముకొరకు ప్రయత్నిస్తున్న వారలను లక్షమందికి ఒక్కడుమాత్రం ఆ నిర్వికారపరమాత్మను ఎరిగినవారున్నారని "శ్రీకృష్ణభగవానులు అర్జునునకు భగవద్గీతోపదేశము చేయునప్పుడే (మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే, యతతామపిసిద్ధానాం, కశ్చిన్మాంవేత్తి తత్వతః" అని అప్పటికే యోగం చేయువారలు లేరనే సూచించిరి.

గనుక యిక్కాలములో విషయానందముకొరకే ముముక్షువులుకూడా పాటుపడుచున్నట్లు కన్పించుచున్నారు. నిర్విషయానందమునకు ఇంతంతఆర్భాటం అవుసరంలేదు. "ఏవంపరంపరంప్రాప్తమిమం రాజర్షయోవిదుః, సకలానేహమహాతా, యోగోనష్టః పరంతప" అన్నట్లు ఎన్నివేల సంవత్సరములక్రిందటనో భగవద్గీతలోచెప్పెను. ఇప్పుడు కుక్షింభరత్వముకొరకు ముముక్షువులు ఉపదేశాదులుచేయుచు విషయలోలులుగా

నున్నట్లు తిరుగుచున్నారు. మొదట నిజముగా మోక్షముపొంద వలెననే జిజ్ఞాసకలిగే సదుద్దేశముతోనే సాంప్రదాయకములలో ప్రవేశించెదరు. దాని అనుసారము ఆయా విధులుచేయుటచేత ఆత్మానుసంధానమునకుబదులు విషయానుసంధానమే ఫలముగా పొందుచున్నారు. ఏ సాంప్రదాయకమైనా తన స్వబుద్ధికి విచారించుకొని ఈప్రశ్నలువేసుకొని అభివృద్ధి ఎంత కలిగెనో విచారించుకొనవలెను. లోగడవున్న దుర్గుణములు ఎవ్విపోయెను? యే దుర్గుణములు కలిగెను? వాయుజయమెంతయయ్యెను? మనసును వృత్తిరహితముగా నిలుపగలశక్తి ఎంతవచ్చెను? కామ క్రోధాది అరిషడ్వర్గములను ఎంత జయింపగలశక్తి కలిగెను? భగవద్దర్శనమాయెనా? శక్తులు కలిగెనా? నేను లోకమునకు ఎట్లుపకారము చేయుచున్నాను? అను మొదలగుప్రశ్నలు వేసుకొని పరీక్షింపచేసుకొని అనుభవమును చూచుకొనినచో క్రమ క్రమముగా అభివృద్ధికి పోగలము. ఎవరికివారు మేము తరించితిమని అనుకొన్నంత మాత్రమున సరియైన ఫలం కలుగదు.

అభ్యాసయోగం లేక హఠయోగం లేక రాజయోగం ఏదైనాఒక ఆసనంమీదకూర్చొని అనగా ఎడమతొడపైన కుడి పాదమును ఎడమ పాదముమీద కుడితొడయువేసి కూర్చొని, లేదా ఎడమమడిమను ఆసనమునకు కొంచెంపైగాను, లింగము నకు క్రిందుగానువుంచి లింగముమీద కుడి మడిమనువేసి కూర్చొని లేక పద్మాసనము అనగా ఎడమతొడమీద కుడిపాదమును కుడితొడపై ఎడమపాదమునువేసి కూర్చొనిగాని లేదా తనకు ఎట్లుకూర్చుంటే సుఖముగానుండునో అట్లుకూర్చొని అంటే వాయువును కుంభించియుండగాను, రేచించునప్పుడును, పూరిం

చునప్పుడును శరీరమును కదల్పకుండా ఎంతసేపు కూర్చొన వలెనో అంతసేపు బాధలేమియూ లేకుండా కూర్చొనగలశక్తి సంపాదించినతరువాతనే యీ క్రిందిచెప్పబోవు పద్ధతుల ప్రకారం చేయనవలెను.

ఎడమముక్కు అదిమి కుడిముక్కుతో శ్వాసనుబాగా పీల్చి కొంచెంసేపుఆపినతర్వాత తిరిగిపీల్చి శక్తిగలంతసేపు ఆపి ఆ ఆపినప్పుడు మనసుతో మంత్రం జపం 4 సార్లో లేక 3 సార్లో అనగలిగినంతసేపు ఆపి నెమ్మదినెమ్మదిగా వదలవలెను కుడి ముక్కునుఅదిమి ఎడమముక్కుతో శ్వాసనుపీల్చి పై విధముగా చేయవలెను. మళ్ళీ కుడిముక్కుతో శ్వాసనుపీల్చి ఆపి ఎడమతో వదలుట, ఎడమతోపీల్చి కుడితోవదలుట యిట్లు 100 సార్లు అభ్యాసము. నియమించుకున్న సమయమునకు తప్పక ప్రతి దినము చేయవలెను. అభ్యాసంచేయునప్పుడు చెడు తలంపులు గాని మంచివిగాని వచ్చుచున్నవేమో, రెండూ లేకుండావున్న దేమో మనసునుకనిపెట్టుచుండుము. తెలుసుకొనుచుండుము. ఏ తలంపులు లేనిసమయమును కనిపెట్టుచుండుము. అప్పుడు ఎట్టి సుఖమున్నదో పరిశీలించుము. యిట్లు అభ్యాసంచేయుట ఎంత వరకు చేయవలెనంటే ఏ తలంపులులేకుండావుండేస్థితి 1 ని. మైనా వుండగలిగినంతసేపు నిల్పితే ప్రస్తుతంచాలును. గాని ఎక్కడికి చాలుననవలె, ఓపికవుండి ఓర్పుతో శ్వాస ఎంత ఆప గలశక్తియైనా నిర్వికల్పసమాధికి సంపాదించితే అంతమంచిది. వస్తువుయొక్క స్వరూపానుభవము ఒక రెప్పపాటుకాలంలో ఏ అనుభవమో ఆ అనుభవమే గంటలతరబడి నిలిపినా రోజులు, నెలలు, సంవత్సరాలైనావుండును. గాని వస్తువులో మార్పే

కాలం ఆపగలశక్తికలుగునో అట్లేచేయవలెను. శక్తికిమించి కుంభకమును చేయరాదు. ఏ అభ్యాసముచేసినా ఏ అవయవ మునకూ ఏవిధముగాను కష్టం కలుగనివ్వకుండా ప్రతిసమయము లోను సుఖస్మృతి కలుగుచున్నదా లేదా అని పరీక్షించుకొను చుండవలెను.

అభ్యాసకాలములోనేగాక తదితర సమయములందు కూడా హంసనడకను గమనించుచుండుము. కుడిముక్కునుంచి గాలివచ్చుట ఎన్నిహంసలు ఎంతకాలమువచ్చుచున్నదో ఎడమ నుంచి ఎన్నిహంసలు వచ్చుచున్నవో కనిపెట్టుచుండవలెను. ఏ నాడి ఆడుచున్నప్పుడు ఎట్టివృత్తులు కలుగుచున్నవో కనిపెట్టు చుండవలెను. కుడినాడి ఆడుచుండునపుడు పగలు ఎడమనాడి ఆడుచుండగా రాత్రిగనుక కుడి 5 గడియలు అనగా 2 గంటలు ఎడమ 5 గడియలు అనగా 2 గంటలుఆడుట సహజముగాని యోగికి ఎక్కువకాలం కుడిఆడుట 2 స్వరములు అనగా రెండు ముక్కురంధ్రములనుంచి గాలి వచ్చుటగాని జరుగుచుండుటను అనుభవమును చూచుకొనుడు. ఎప్పుడైనా అజ్ఞానకార్యములు అనగా స్వస్వరూప నిష్ఠయొక్క స్మృతిలేకుండా ప్రాపంచిక కార్యములు చేయుచున్నప్పుడు ఎడమ ఆడుచుండును. ఆరూఢు నికి ఆ సమయములలోకూడా 2 స్వరములు ఆడును. గనుక పై అనుభవములను చూచుకొనవలెను.

యోగికి ఎల్లప్పుడు ప్రతిహంసకు సుషుమ్నాగుండాగాని సూర్యచంద్ర నాడులగుండాగాని సహస్రారమందున్నట్టి దేహ మందంతటను వ్యాపించినట్టి పరమాత్మదర్శనమును చేయుచునే

శ్వాస విడుచుచుండును. ఎప్పుడు పరీక్షించినను 1 ని. 15 హంసలకంటె తక్కువ నడుచుచుండును.

ఇట్లు హంస తక్కువనడిపించుటవలన భగవమద్దేశ్యరీత్యా రోజుకు 21600 హంసలు అగుటకు కొన్ని రోజులుపట్టును. అంత కాలం 1 రోజు క్రిందనే లెక్కకట్టుటగనుక యీరీత్యా ఆయుర్వృద్ధి అగును. ప్రతిహంసను స్వరూపదర్శనము చేసుకొనే నడుచుచుండును. గనుక అన్నిమలములుపోయి స్వచ్ఛమైన స్థూల సూక్ష్మశరీరములుండుటవల్ల ఆరోగ్యాభివృద్ధియూ కలుగుచుండును. యోగికి యిహమందుండగానే సమస్తసుఖములు కలుగుచుండును. ఒక్కహంసను జాగ్రితగా నడుపుచుండుట వల్లనే సమస్తశిద్ధులు మోక్షముకలుగును. తానే బ్రహ్మస్వరూపముఅనే అనుభవము సాక్షాత్కారముగా కన్పించుచుండును ఇటిస్థితిలో జీవుడే బ్రహ్మస్వరూపముఅనే అనుభవము నిస్సందేహముగా కన్పించును. గనుక వాయువునుఆపుట (ప్రాణాయామముచేయుట) ఎంతవరకు కావలెనంటె ప్రతిహంసకు నిర్గుణాకారవృత్తి మనసు సంకల్పాదులు చేయుచున్ననూ అనుభవముకన్పించునంతవరకు 1 ని. ఆపుట అభ్యసించుట అవుసరము గనుక ప్రతిముముక్షువు 1 ని. వాయువునుకుంభకమునఆపుట నిల్పుచుండవలెను. యెన్ని అభ్యాసములు, ఎన్ని విచారణలు ఎంత కాలంచేసిననూ మనోబుద్ధులుగాని ఇంద్రియములుగాని చెడవు. వాటివాటి వ్యాపారములకు భంగమేమియు వుండదు. అయితే అభ్యాసాదులవల్ల వుపయోగ మేమంటే తామరాకుమీద చమురువుండి నీళ్ళను అంటనివ్వనట్లునూ, కుమ్మరిపురుగు బురదలో తిరుగుచున్ననూ బురద అంటనట్లునూ, నాలుకకు

జిడ్డు అంటనట్లున్నా. మానసాదులకు యోగాదిసాధనలవల్ల విషయాదులు అంటకుండునట్లు చేయుటయే అభ్యాసాదులవల్ల నుపయోగములు.

స్వరూపస్థితి, మానసాదులు వాటివాటి వ్యాపారములు జాగ్రదవస్థలో చాలింప చేసినప్పుడువున్న అనుభవమే పర మాత్మైక్యానుసంధాన స్వరూపానుభవము ఇట్లు వీలైనప్పుడెల్లా చేయుటే మొదటిపని. జ్ఞానికి, యోగికి, భక్తునకు, ముముక్షు వునకు 2 వ. పని మానసాదులు వాటివాటి వ్యాపారాదులలోనే తగులుబడి విషయాదులలోగల మలినాదులు (కామక్రోధాది దుర్గుణాదులు) వాటికంటకుండా చేసుకొనుటకే యోగాది సాధనములు జీవితాంతమువరకు చేయుచుండవలెను. గనుక ఆరూఢుడైనా జీవన్ముక్తావస్థనుపొందిన జన్మరాహిత్యునికైనా పై చెప్పిన 2 పనులు ఆజన్మాంతరము తప్పనిసరిగా ఎంతెంత చేయగలరో అంతంత దినదినాభివృద్ధి చేసుకొనుచునే యుండ వలెను. పూర్వజన్మలో చేశాను అందుకని యీజన్మలో చేయ నవసరంలేదని కొందరు ప్రాణాయామాదులు మాకక్కరలేదని దీనికిమాత్రం చెప్పుచున్నారు.

పూర్వజన్మలో బి. ఎ., ప్యాసైనాను. యీజన్మలో 1 వ. తరగతినుంచి బి. ఏ., వరకుగల తరగతులు చదువకయే వచ్చుచున్నావా? పోనీ పూర్వజన్మలో నిలుచుండి, పరుగెత్తి మాటలు అనేకతరహాలుగా నేర్చియుండియూ యీజన్మలో అమ్మ, అత్త, నాన్న మొదలైనమాటలు నేర్చుకొనుటలేదా? ఇంద్రియ వ్యాపారాదులన్నియూ మొదటినుంచి నేర్చుకొను చున్నారు. గనుక ప్రాణాయామమునుమాత్రం యిప్పుడు

చేయకయే ఎట్లు పూర్వజన్మఫలం వచ్చును? ప్రతి ముముక్షువు భక్తి, జ్ఞాన, యోగ అభ్యాసాదులు చేసితేనే వాట్లఅనుభవము గాని పూర్వజన్మలో చేసినా ప్రతిజన్మలోనూ చేయవలెను. చేసిన యోగసాధనలు వ్యర్థమానా? అంటే మరచినవిద్య తిరిగి నేర్చిన త్వరలో గ్రహించినట్లు త్వరలో వాయువు కుంభకసిద్ధి కల్గుటేగాని ఫలం. ఈజన్మలోనే ప్రారంభించినపని ఆలస్యంగాను కష్టంమీద ఫలమునుపొందుట మనఅనుభవమేగదా? కొందరికి మొదట చెప్పగానే గ్రహింపుగలుగును. అదేపనికొందరికి అనేక సార్లు చెప్పిననూ గ్రహింపలేకుందురు ఎందువల్ల? అట్టిపని యీ జన్మలోనే ప్రారంభించినట్లు అనుకొనవలెను. గనుక ప్రతిభక్తుడు పట్టుదలతో అభ్యాసములు ఓర్పుతో చేసి దానిఫలము వచ్చే వరకు (కుంభకము చాలాకాలము నిల్పగలశక్తి) అభ్యసించుటే పని. ఇది లేనివారలకు ఏవిధమైన జన్మరహితత్యాగుర్తులు వుండవు.

దృష్టిఅభ్యాసము లేక త్రాటకాభ్యాసము :- రెప్పలను తరుచుగా వాల్పకుండానిలుపుట ఏదేని ఒకేస్థానమునుచూచుచు హాంసలు నిలుపుచు, 4, 5, 6, 7 హాంసలు అయ్యేవరకు నిలుపుచు, క్రమక్రమముగా, 20, 30 హాంసలకాలము నిల్పవలెను. ఇట్లు అభ్యసించుచుండగా చూపు అంతర్ముఖమై చూడబడే వస్తువుకన్పించకుండాపోయి వెలుగుగాను, రంగులురంగులుగాను కన్పించుచూ ఆ సమయములో దేహస్మృతితప్పియూ మొదలైన అనుభవములు కన్పించికన్పించి చివరకు ప్రాపంచికవ్యవహారకాలములలో బహిర్గతమైన చూపు సమయములోకూడా ఏసాధనలులేకుండా స్వరూపదృష్టి కలుగువరకు (తన దేహాదులు లేనిసమయము) దీనిని అభ్యసించుచుండవలెను.

అభ్యాసము చేయునప్పుడు కండ్లెరప్రపడకుండా రెప్పలు నిల్పవలెను. క్రమక్రమముగా దృష్టినిల్పుట హెచ్చుచేయ వలెనేగాని కండ్లకు బాధకలిగేటట్లు ఎక్కువకాలం ఆపరాదు. అంతర్దృష్టిని మూలాధారాది కమలములవద్ద ఒక్కొక్కసారి నిల్పుచున్నందున కొన్నిశక్తులు కలుగుచుండును. దృష్టిని భ్రూమధ్యమందు నిల్పుచుండవలెను. అట్లు నిల్పుట సిద్ధించి నపుడు 2 కనుబొమలమధ్య గులగులలాడినట్లుగాని, చేతితో తడవినట్లుగానిఅక్కడపొక్కినట్లుకనుపించుచుండును. తేజస్వంత ముగా ముఖముకన్పించును కండ్లుమూసికూడా లక్ష్యం అక్కడ (భ్రూమధ్యమందు) నిల్పుచుండవలెను. యెంతసేపైనా కండ్లు తెరచి ఆజ్ఞ్యచక్రమందుగాని, యేదేని స్థూలరూపముమీద (పటముమీద) గాని, దృష్టిని చాలాసేపునిల్పుచు వెంటనే కండ్లు మూసి ఆ రూపమునుమనస్సుకుకన్పించునట్లుచూడవలెను. ఆత్మ దర్శనము కలుగుచున్నందుకు దృష్టి అప్రయత్నముగానే నిల్చు చుండును. నిరాలంబమైనబయలునందు అంతర్దృష్టి నిల్పుచుండ వలెను. సద్గుణసంపద = సత్ + గుణము, సత్ = అనగా త్రికాలాభాధ్యమానమై నిత్యమై, శుద్ధమై, ముక్తమైనవస్తువు. గుణమనగావృత్తిగనుక సద్గుణమనగానిత్యమైనవృత్తి, సత్యమైన వృత్తి, శుద్ధమైనవృత్తి, పరమానందమైనవృత్తి, నిరతిశయానంద మైనవృత్తి యిట్టివృత్తిని సంపాదించుటే, పొందుటే, అనుభ వించుటే సద్గుణసంపదఅందురుగాని స్నానాదులుచేసి మడికట్టు కొని, అలికిందేఅలికి, తోమిందేతోమి, పూజలు, తీర్థయాత్రలు, హరినామోచ్చారణాదులుకావు. సత్యముపలుకుట కుచ్ఛితము మొదలైనదుర్గుణములులేకుండుట. అవిచేసిపైస్థితినిపొందగలుగు

టకు సహాయపడేవిఅయినట్లయితే అవిఅన్నియూకూడా సద్గుణ
ములేయగును. గాని అటిస్థితి కలుగకపోగా అహంభావము,
కామక్రోధాద్యావేశములు, దురభిమానములు మొదలగు
దుర్వృత్తులకు అవకాశము కలుగచేయుచూ అతఃపాతాళము
నకు తీసుకుపోయే గుణములు, పనులు సద్గుణములు గాకపోగా
అవి దుర్వృత్తులేయగును. పైకి సద్గుణములుగా వుండునుగాని
అహంకారాది దుర్గుణములకు సహాయపడు చున్నందున
దుర్వృత్తు లనవలసివచ్చెను. సద్గుణములే మోక్షమార్గము.
గుణములే నిర్గుణమును పొందింపచేయును. ఇదియేయుక్తి
సద్గుణాచరణలేని భక్తి, జ్ఞానాదులు మోక్షమివ్వనేరవు. గనుక
మొదట సద్విధులే విధిరహితత్వస్థితిని పొందింపచేయును. వీటినే
సత్కర్మలు సత్కర్మలే కర్మలేనిస్థితిని పొందింపచేయును. మురికి
మురికిని పోగొట్టునన్నట్లున్నది. ఒకరకమైన మురికిని మరియొక
రకమైనమురికే పోగొట్టును. చెంబులకుపట్టిన చిలుముఅనేమురికిని
చింతపండుపులుసుఅనే మురికిపోగొట్టునట్లు చింతపండుపులుసును
మురికిఅని వాడము. గాని మురికియే. తత్వమును ఎరుగనివారల
కీట్టి సంశయములు చాలా పుట్టును. చేదును చేదుపోగొట్టునా?
అజ్ఞానమును అజ్ఞానము పోగొట్టునా? యిట్టివి చాలాకలవు. గాని
సిద్ధాంతముమాత్రము దేనికి ఏదివిరుగుడో అదియే అదిఅని
చెప్పుట విషమునకు మరియొకరకమైనవిషమే విరుచుచున్నది.
భక్తి, జ్ఞాన వైరాగ్యాదుల అనుభవములేనివారలకు యిట్టి
సందేహములు ద్వైతాద్వైత విశిష్టాద్వైతాద్యభిమానములవల్ల
దురావేశాదిగ్రస్తులై దురహంకారములో మునిగినవారలకే
ఎన్ని ఉపమానములు చెప్పిననూ సంశయములువిడవు. అసలు

సృష్టిలో మంచిఅని చెడుఅని కష్టము సుఖము మొదలైన ద్వందములు, భేదములు మనంకల్పించినకల్పనలే; మనకిష్టమైనవి మంచివిఅని యిష్టముకానివి చెడుఅని మనమే పేర్లుపెట్టినాము. ఆ చెడుది తనకవసరంఅయినప్పుడు మంచిదనడం ఇట్టివి అనేకములు గలవు. దురభిమానములులేని సమదృష్టితో ఆలోచించిన ద్వందరహితమేవున్నట్లు తనకనుభవము కనపడేవరకు సంశయములుపోవు. హోమ్యోపతి వైద్యసిద్ధాంతము ఏజబ్బు దేనివల్ల కల్గెనో ఆవస్తువే ఆజబ్బును పోగొట్టసామర్థ్యము సూక్ష్మరూపంలోకి ఆవస్తువు పోయినకొలది శక్తి అభివృద్ధియై చెడునుపోగొట్టి మంచిశక్తి కలుగజేయుననే సిద్ధాంతముపై వైద్యమంతా ప్రవర్తించెనుగదా? సూక్ష్మరూపమైనఆత్మకు ఎక్కువశక్తి కలిగిన వస్తువగుట మానసాదులకు తక్కువశక్తికలుగుట అంతకంటె సూక్ష్మమైనవస్తువే లేనిదానికే ఆత్మ అతిసూక్ష్మము పొందగా పరమాత్మఅను పదములుకలిగెను. "సూక్ష్మాత్సూక్ష్మతరంనిత్యం తత్వమేవత్వమేవతత్" అని వున్నది. దానిభావము పై చెప్పినసిద్ధాంతమే. స్థూలముగా తనకు లోకమునకు నష్టకష్టములుకల్గించే అబద్ధములాడుట, కుత్సితము, కుయుక్తులు అనేక అబద్ధములాడి లోకులధనధాన్యములను అపహరించుట, గర్వము అహంభావము, కోపము, ఆ పోవనియునికి, దురభిమానము, వ్యభిచారాది దుర్గుణములనైనా విడువక పై చెప్పినదుర్గుణములు తను కల్గియుండియూ తాను బ్రహ్మస్వరూపమైనానని చెప్పుకొనుచూ బ్రహ్మస్వరూపమైనతమకు ఆపై దుర్గుణములు వుండవచ్చునా అని యితరులుఅడిగితే బ్రహ్మస్వరూపము నిర్గుణము. దానికి ఎన్నడూ ఏగుణములు లేనేలేవు. ఆ పైదుర్గుణములు

యెవరికివున్నవిఅనగా మానసేంద్రియములకుగాని బ్రహ్మమైన తనకులేవని దుర్బుద్ధతతో ప్రవర్తించుట నేను మనసునుగాను, ఇంద్రియములుగాను గనుక వుండియూ లేనివాడనై నానని జవాబుచెప్పుచూ తానుపాడై లోకులనుగూడా పాడుచేయు చున్నారు. గాన పై దుర్గుణములు లేనివారే మహనీయులు. వారే జ్ఞానులు, వారే పుణ్యాత్ములని అనుకొని వారి స్నేహము చేయవలెను.

గనుక సద్గుణసంపదే అట్టి సద్గుణములను అలవరచు కొనుటకే తత్వవిచారణ, భక్తి జ్ఞాన వైరాగ్యాది సాధనలన్నియు అందుకేగాని వేరే జన్మరాహిత్యము ముక్తిలేదు. గనుక దుష్టగుణములను వదులుటే జ్ఞానము.

అహంకారాదిమానగ్రస్తులై, కామక్రోధాధి ఆవేశ వంతులైన దుర్మార్గులు, ఎంత విచారణచేసినా, ఆ దుర్గుణములు పోనందున నిరుపయోగమగును. ఏ తత్వవిచారణ లేకపోయినా ఆదుర్గుణములు లేకుండా చేసుకొంటే అదే జ్ఞానము.

జపముచేయు విధము : జపముచేయు మంత్రముయొక్క అర్థమును తెలుసుకొని ఆ భావనను పొందుచు, పదే పదే ఆ మాటను నోటితో ప్రక్కనున్నవానికి వినిపించకుండావుండే లాగున,స్పష్టంగా నోటికి శ్రమ కలుగకుండా వుండేలాగున, స్పష్టముగా నోటికి శ్రమకలుగువరకు అని అని పెదవులు కదిలించకుండా అనుటనుమాని, ఆ మాటను మనసుతో అనుచుండవలెను. అప్పుడు ఆ నామముయొక్క వస్తుభావన కలుగును. ఆ భావనను చూచుకొనుచు మనసులో నామో చ్చారణమాని స్థాయిని అనుభవించుచుండవలెను. మానసిక జపం చెవులకు విస్పష్టముగా వినిపించేలాగున అనుచుండవలెను

అనేకవేల జపం కాలేదనే దృష్టిపుంచుకొనరాదు. నోటితో అని మనసుతో అనుట, మనసు అనుచుండగా అది ఆగి వేరే యితర విషయములు జ్ఞాపకం రాకుండా వున్నకాలం, ఎప్పుడు కలుగునా అనే దృష్టిమాత్రం వుంచుకొని నోటితో జపంగాని, మానసికజపంగాని చేయవలెను. మనసు ఏ తలంపులులేకవున్నప్పుడు వున్నసమయమే పరమాత్మదర్శనము. అటిస్థితి యే స్వరూపస్థితి అటిస్థితిఎప్పుడుకలుగునోఅనిఆదుర్దాతోవుండి జపం చేయవలెగాని, వెయ్యి జపం ఎప్పుడు పూర్తి అగునాఅని కని పెట్టుకొని వుండరాదు. అది కలుగగానే జపం ఆపి అనుభవ మును చూచుకొనవలెను. జపంవల్ల ఆత్మైక్యాను సంధానము నిజముగా కలిగినట్లు అనుభవముకలుగగానే, అట్టివారికి కలుగు బైటగుర్తులు, లోపలిగుర్తులను చూచుకొనవలెను. ఈ గుర్తు లన్నియు కలిగినయెడల జపసిద్ధి కలిగినట్లే. లోగడ ఆగుర్తులు వ్రాసియుంటిని. గాని అవి తిరిగి చూచుకొనుట కష్టమని తిరిగి వ్రాయుచున్నాను. బాహ్యాగుర్తులు (1) 2 ముక్కురంధ్రముల నుండి, శ్వాస వదలినప్పుడు. పీల్చినప్పుడు గాలి సమముగా రావలెను. అట్లు గంటల తరబడి మధ్యమధ్య తెంపు లేకుండా వుండవలెను. ఏలనన సామాన్య మనుజులకు కూడా అప్పుడప్పుడు అనగా ఒకముక్కునుండి మరియొక ముక్కు కు శ్వాస మారునపుడెల్లా వడుచుచున్నప్పుడు, ఇంకా కొన్ని సమయములలోకూడా జంటస్వరములు (2 ముక్కురంధ్రముల నుండిగాలి వచ్చుట) ఆడుచుండును. గాని యిది వెంటవెంటనే మారిపోవును. జపంలో ఆత్మైక్యాను సంధానము కలిగినపుడు ఆడే జంటస్వరములు కొన్ని గంటలతరబడి, కొన్నిరోజులపాటు ఆఖరికి యెప్పుడుపరీక్షించుకుంటే అపుడల్లా ఆడునట్లుకన్పించును.

2. మగతగావుండుట, నిద్ర వచ్చినట్లుండుటమాత్రమే గాని నిద్రకాదు. నిద్రఅయితే వళ్ళు తూలుచుండును. కండ్లు బరువులుగా వుండును. నిద్రవచ్చినవానికివున్న మొగకాంతితో కండ్లు మొదలైనవివుండుట, ఆవలింతలు వచ్చుట, నిద్రఅయితే పడుకొనేతీరవలెనను కోరికుండును. ఆమగతగానున్నపుడుఎంతో హాయిగాను, ఆత్మానందానుభవమును చాలాకాలంఅనుభవించ వలెననే వుల్లాసముండును.

3 శ్వాసలు ఆపకుండనే తగ్గుచుండును 1 నిముషమునకు 15 హంసలు మామూలై యుండగా 1 నిముషమునకు 5, 6 హంసలుమాత్రం పట్టకుండానే విడుచును. ఇట్లు గంటలతర బడి వుండును. ఆపవలెననే వుద్దేశముతో తగ్గించుటకాదు. స్వభావమే అగును. జపకాలంలోగాక, యితర సమయములలో నూ అట్లుండుటే గురుముఖ్యం. 4 శరీరావయవములన్నియు మృదుత్వముకలిగి ప్రకాశవంతముగను, ఆరోగ్యవంతముగను ప్రకాశించును.

5 అన్ని యింద్రియములు, వాటివాటి వ్యాపారములు ఆపవలెనన్నపుడు ఆపగలుగుట, పనులు చేయించవలె నన్న పుడు హుషారుగాను, పుష్టిగాను, తుష్టిగాను చేయగలుగుట అనగా నోటిలో పటికబెల్లం మొదలైనవి పెట్టుకొనగానే అది కరుగకుండా నిలుపుట, కరుగవలెననుకొనగానే కరుగుట, ముక్కుకు వాసన తెలియకుండుట, తెలియవలెననిఅభిమానించి నపుడు తెలుసుకొనగలుగుట, అట్లే చెవులకు, కండ్లకు, త్వగిం ద్రియము (తాకి తెలుసుకొనుతోలు) యీ త్వగింద్రియము వల్లనే స్త్రీ కామము అదికూడా ఆపకలుగుట, కోరినపుడెల్లా,

ఆపకలుగుట, చలింపచేయుట, యిట్లు అన్ని యింద్రియముల యొక్క విషయములు గ్రహింపనగును. దీనికే ఇంద్రియ జయం. ఇంద్రియ జయమే. ఇంద్రియ వశీకరణము అనెదరు. ఇవి అన్నియూ ఎదుటివారికికూడా కన్పించును. కన్పింపచేయు అనుభవములు కలుగును.

ఇవి క్రమక్రమముగా ఆత్మైక్యాను సంధానానుభవ మును వృద్ధికానుకాను అన్ని అనుభవములు కలుగుచుండును. కొందరు మూఢులు (మనోలయ, ఇంద్రియ వశీకరాదులు అనుభవములేని వాగ్వేదాంతులు 7 అజ్ఞానులు, జ్ఞానిఅయితే ఇంద్రియ విషయ వ్యాపారాదులేలవున్నవి? అవి ఎందుకువదల లేదు? ఎందుకు సన్యాసం పుచ్చుకోలేదు ? అని మొదలైన కుత్సిత ప్రశ్నలు వేయుచున్నారు. సంశయముకూడాను. అందుకు జవాబు జ్ఞానానుభవము కలిగినంతమాత్రాన (మనసు సంకల్పరహితమై, యింద్రియములు వశీకరణమై) సంసారం (భార్యా పుత్రమిత్రాదులను) వదలవలెననే విధి లేనేలేదు. అట్లువదలుట (దుర్జడత దురాచారమే, వక్రనడకే, భగవ దుద్దేశమునకు వ్యతిరేకపునడకే.)

జ్ఞానానుభవము కలిగినందులకు గుర్తులు భార్యా పుత్ర మిత్రాదులను వర్జించుటకాదు. వాటియందుగల కామక్రోధా ద్యావేశములు, విషయలోలత్వాదులు వీటిని వర్జించి, వాటి యందు సద్భావనతో, కాలము గడపుట అనుభవముకలిగి నందులకు ఫలము, గుర్తులు సంసారత్యాగమనగా. మనస్సు సంకల్పాదులకు లోనుగాకుంటే అవి విషయ వ్యాపారాదులు వదలుట, సన్యాసం పుచ్చుకొనుట) దుర్జడతలు దురాచార

ములు వక్రినడకలు అన్నారేమి? జ్ఞానినడకలుగావా? అంటే దుర్నడకలకంటే దుర్మార్గునికంటెను వ్యర్థుడే, వానిని ఏమిఅన వలెనో తెలియక ఆపదములువాడితిని. పై పెచ్చు ఈశ్వర ద్రోహులుఅంటే బాగుండునేమో ఎట్లనగా జ్ఞానానుభవము కలిగినందులకు తలితండ్రిల సేవచేయక వారిని దుఃఖపెట్టి దారా పుత్రాదులను దిక్కులేనివారలుగను, అన్నవస్త్రాదులు లేని వారలుగాచేసి తాను విషయములకొరకు యితరులను ఆశ్రి యించు చుండుటయా!

ఇట్లు కొందరు బ్రహ్మజ్ఞానానుభవమని పేరుపెట్టుకొని అట్టివక్రినడకలునడుచుచూ వున్నందువల్లనేకాబోలు కొందరు జ్ఞానులు ఫలానివారివద్ద జ్ఞానం నేర్చుకొంటున్నాడు, మాకొంప ఆగురువుతీశాడు అని బహువిధదూషణలుచేయుట తటస్థించినది కనుక అట్టి వికారనడకలు ఏమియూ అక్కరలేదు.

నేనువ్రాసిన బాహ్యగుర్తులు కలిగియుండుటకు సన్యాస మక్కరలేదు. విషయవ్యాపారాదులు చాలించవలసినదేమి? అన్నియూ తనస్వాధీనములో నుంచుకొనగలిగిన శక్తివంతుడు అగుటచేత జపసిద్ధిపూర్ణఫలము యిక అవకతవకయొక్కఫలం మనసుచెడి పిచ్చిఎత్తి పై విధంగా చలించుటే.

అంతరగుర్తులు 1 ఎల్లప్పుడు బయలు (ఆకాశస్వరూపం) ధారణ అగుచుండును. సుఖదుఃఖములును ఆత్మానుభవముగానే చూచును. శరీరములోనుండి అన్నివ్యాపారాలుచేయుచున్ననూ ఏమియూ చేయనివారివలెవున్నట్లుండును. ముక్తావస్థయేజన్మలో వుండగానే జన్మలేనిస్థితియే బ్రహ్మాండములోగల ఏ భూత ములకుగాని, ఏ ప్రాణికిగాని వీరివల్లసుఖదుఃఖములులేని జీవితమే

స్వస్థితిగలిగినతర్వాత సంసారంవిడిచి అడవులవెంట దేశములవెంట తిరుగుట, ఆహారంమాని ఆకులలములు తినుట, బాలోన్మత్తపిశాచాదులుగాతిరుగుట, యిప్పుడుచూచే బాహ్యవేషాదులు (దండకమండధారులు) అనేకరకములుగా వుండుట తప్పా? అంటే ఇంద్రియానిగ్రహత్వము, మనోబుధ్యహంకారాతీతము ఎల్లప్పుడు స్వరూపధారణము, గుణాతీతము మొ॥ అనుభవములు కలిగినతర్వాత ఏవేషములు ఎట్టిమార్పులుపొంద నవసరములేదు గాన తప్పే.

పై స్థితిని పొందుటకుగాని పొందినతర్వాతగాని ఏరకముగాను మార్పునవసరములేదు. స్వస్వరూపానుసంధానానుభవము స్థిరపడినకొలది బాహ్యవ్యాపారాదులు తగ్గించుకొనయిచ్ఛ శరీర వ్యవహారానుకూలమునుబట్టి, జరుగుబాటునుబట్టి తగ్గించుకొంటే తగ్గించుకోవచ్చును. తగ్గించుకొనక చేయుచున్ననూ చేయవచ్చును. తనయిష్టము యిట్లాగే వుండవలెననే విధినిషేధములు లేవు. కొందరు అజపగాయిత్రి సర్వదా జరుగుచునేయుండును. గనుక వేరేజపం చేయనవసరం లేదనెదరు. జపం మానెదరు. విపరీతార్థమే వుచ్ఛ్వాస, నిశ్వాసములు ఎల్లప్పుడు జరుగుచునే యుండును. గాని ఏమిలాభం. ఇకఎట్లంటే గాలిపూరించినపుడు నివృత్తిఆకారం మనసుకుతోచుట రేచించినపుడు సోహంఅను మంత్రముగాని, శ్రీరామఅను మంత్రముగాని ఏదైనాఒకమంత్రమును భావించుచూ హంసను విడుచుచుండవలెను. ఇట్లు ప్రతిహంసకు చేయుచుండుటే అజపగాయిత్రిఅగును. ప్రతిహంసకు నివృత్తిఆకారం మనసు అనామముఅనుట పొందుట యిట్లుప్రతిహంసకు చేయవలెను. ఇదే అడుగడుగునకు మాధవాను చింతన

సుధామాధుర్యమున మేను మరచువాడు. "నిముషార్ధంనతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీంవినా" అనుట. హంసను గంటలతరబడి లెక్కించుటకూడా జపమేఅగును. అప్పుడు ఏ జపం చేయనక్కర లేదు. స్వరూపస్థితి కలుగును.

ధారణచేయువిధము :- మొదటతమకు మిక్కిలి ప్రియతమమైన ఆకారమును కండ్లుమూసికొని ఆరూపము నిస్పష్టముగా మనస్సుకు కన్పించులాగున చూచుచుండుటే ధారణ. ఆ రూపం మనసులో కన్పించుచుండగా యితరవృత్తులు జ్ఞాపకమునకు రాకూడదు. అట్లు వచ్చినపుడు కండ్లు తెరచి ఆ రూపమును బాగా వర్ణించుచూ చూడవలెను. అనంతరం గురు స్వరూపమును, తర్వాత తనయిల్లు, గ్రామము, భూమి అంతయూ అటుమీద సూర్యచంద్ర నక్షత్రమండలములను ఒకేవృత్తిలో కన్పించినట్లు భావించవలెను. మనసునువిజృంభింపచేయుట ఒకే వృత్తిలో యీ చూడబడు సృష్టినిఅంతయూ భావించుచూ ఆయారూపములు కన్పించేలాగున చూచుచుండుట. ఇటిస్థితిలో ధారణ పోవుటఅనునది లేకుండును. ఎప్పటికప్పుడే ధారణలో నుండునట్లే వుండును. ఇది సాకారధారణ అననగును.

ఇక నిర్వికారధారణ. అంతులేనిబయలుగా భావించుట. అప్పుడు సృష్టిలోగల నామరూపములు ఎవ్వియూ కన్పించకుండా ఒక్కపెట్టున సృష్టిఅంతయూపోయి బ్రహ్మాండమంతయూ నిండినవస్తువు అనుభవము నామరూపాదులలో వుండియూకూడా చూడగలుగును. ఎప్పటికప్పుడు బట్టబయలు కన్పించినట్లుండును. సృష్టి లేనేలేదనేస్థితే ఏర్పడును. ఎన్నడూ సృష్టి లేదనేస్థితినిర్ధారణఅగును. తన స్వరూప అనుభవమును

వృద్ధి కానుకాను సృష్టిలేదనేస్థితి ఏర్పడును. ఇదే నిరాకార ధారణ. నిర్వికారోపాసన యీ అనుభవమునకువచ్చిన ఉపాసకు నకు వ్యవహారమందైనను స్వరూపచింతనవలదు. వ్యవహార నామరూపాదులు వెంటవెంటనే నశించిపోవును. సదా నిర్మలత్వ స్థితి ఏర్పడును. సమిష్టిధారణ ఏమాత్రమైననూ స్వస్వరూపమే అగును.

వ్యష్టిధారణ (ఖండసాకారం) ఎప్పుడూ ఖండస్వరూపాను భవమే అగును దీనివల్ల జీవన్ముక్తి కలుగదు. యీ 2 రకముల ధారణలు ఏ రకముగానైనను సర్వకాల సర్వావస్థలయందు మనసులో నిల్పుకొనుచుండుట అనగా సమయము చిక్కినపు డెల్లా మనోయింద్రియాదులకు ధారణవుండుట ముక్తస్థితికి ముఖ్యాభ్యాసము గాన సాకారధారణద్వారా నిరాకారధారణ నిరాకారమునుంచి సాకారధారణకు వచ్చుచున్నప్పుడున్న అను భవములను జాగ్రతగా పరిశీలించుచుండవలెను.

7 సద్గ్రంధ కాలక్షేపణ : ఏపుస్తకం చదువుచున్నప్పుడు 1 తాము నియమించుకున్న లక్ష్యార్థముయొక్క అనుభవము కలుగుచుండునో 2 తదనంతరంకూడా స్వరూపానుభవమును ప్రోత్సాహపెట్టునో 3 సత్ప్రవర్తనను విడువకుండుటకు స్థిరపర చునో యీ మూడుగుణములుగల దానిని చదువుటే, చెప్పు కొనుటే, వినుటే సద్గ్రంధకాలక్షేపన. అట్టి గ్రంధములెవ్వి? ఫలానివిఅనిమాత్రం నిర్ధారణ చేయలేముగాని ప్రతి పుస్తకము లోనూ కొంచెముగనో, గొప్పగనో వుండేతీరును. కాని అది విడతీసుకొనుశక్తి అనుభవముకలిగి యుండినవేతప్ప లేకుంటే. చాలా మోసంజరుగును. అధోగతికికూడా హేతువులగును.

ముందు చదివిచూచి నిర్ధారణ చేసుకొనవలెను. యీ పుస్తకం మాత్రం అంతయూ పై అనుభవములేఅని చెప్పుట అతిశయోక్తి కానేరదు.

మిగిలిన పుస్తకములు కలగోలుగంపగా వుండును. సదా స్వరూపానుభవమున నిమగ్నులైన మహనీయులు మాత్రము వ్రాసినగ్రంధములు పై అనుభవమునకు సూటిగా వ్రాసి వుందురు. ఆయా పుస్తకములలోని అంశములయొక్క అనుభవ ములనుబట్టి అవి సద్గ్రంధములనుకోవలెను. ఉ॥ సీతారామాంజ నేయము, భాగవతము, భగవద్గీత మొదలైనవి నవలలు, కొన్ని నాటకములు, కొన్ని పురాణములు మొదలైనవి విషయలోలత్వ మును వృద్ధిచేయును. అట్టివి చదివిన లోగడగల సద్గుణసంపదను తికమకలుపెట్టును. ప్రతి పుస్తకములోను యేదోయొకనీతి యో, ప్రాపంచిక నడతలనుగురించియో, రాజనీతియో బోధించుచునే యుండును. మోక్షానుభవారూఢత్వమునకు సహాయముచేయు గ్రంధములను బాగుగాచదివి అనుభవమునకు సూటిగా వున్న వాటినే చదువవలెను. ఏదోయొకసంగతి ఏదోయొకపుస్తకములో చూచి ఆసంగతి శాస్త్రసమ్మతమని వాదించువారిని అనేక మందిని చూచుచున్నాము. ఆ వ్రాసినవారు యెవరైననూ గొప్ప అనుభవనీయులైన పెద్దలపేరుపెట్టి ఆపుస్తకం అచ్చు వేయించినంతమాత్రమున ఆ విషయములన్నియు వారు వప్పు కొని వారి అనుభవములని నమ్మువారిదితప్పుగాని వ్రాసినవారిది కాదు. ఏ గ్రంధంచదివినా యీ పుస్తకంలోని అనుభవములను కలిగించి ప్రోత్సాహపరచునో అట్టి గ్రంధములనే చదువవలెను.

వ్యవహారనడత : జపాధ్యాభ్యాసాదుల కాలముతప్ప మిగిలినకాలమున్నూ, ప్రాపంచిక విషయార్జనాదులకు విని యోగపర్చుకాలమున్నూ జాగ్రదవస్థలోచేయు పనులకు వ్యవ హారనడత అనెదరు. అట్టి సమయములలోకూడా జపం అనగా నామోచ్చారణ (స్థూల, సూక్ష్మ, అంతరంగిక మానసికముతో చేయుటకు ఆయా వ్యవహారములనుబట్టి చేయుట) ధారణయో (సాకార నిరాకారంచేయుటకు యోగ్యతగలిగినవ్యవహారమో) హంసలక్ష్యమో, ఉపరతి సుఖానుభవము చేయుటకు వీలైన వ్యవహారమో ఆయా వ్యవహారములు పై చెప్పిన ఏఏపనులు చేయుటకు వీలగునో చూచుకొని దానినిచేయుచూ వ్యవహ రించవలెను. ఉ॥ నడుచుచున్నా మనుకొనుడు అప్పుడు జపం చేయుటకు వీలుఅగును. భుజించునపుడు భగవన్నామోచ్చారణ చేయవీలగును. నిద్రకు పడుకొన్నామనుకొనండి అప్పుడు ధారణ చేయ వీలగును. యిట్లే యితరపనులప్పుడుకూడా గ్రహించి వ్యవహరించవలెను.

ఇట్లుచేయక అభ్యాసకాలములోమాత్రం ఆత్మనిష్టకలిగి యుండి, తదితర సమయములలో విషయలోలత్వాదులలోచిక్కి దుర్నడతతో ప్రవర్తించు చున్నయడల యెన్నటికీ, "ఆత్మనో న్యన్నకించన సర్వంఖల్విదంబ్రహ్మ ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అను మొదలగు మహా వాక్యార్థాను భవమునకు యెప్పటికీ రాలేరు. సర్వవిధములాభ్రష్టుడు క్రమేపిఅయి లోకులనుకూడా పాడుచేయును. గనుక ముఖ్యముగా వ్యవహార కాలములలో కూడా "స్వరూపాను సంధానంవినా అన్యథాచారపరోన్న భవేత్" అనే ఉపనిషద్వాక్యానుభవము కలిగియుండుటకు

ప్రయత్నించు చుండవలెను, సత్యము, ధర్మము మొదలగు సద్గుణములను జాగ్రతగా నడుచుచుండవలెను.

9 సత్సహవాసము : బాహ్యాభక్తి అభ్యాసపరులకు బాహ్యాభక్తియందు ఆరితేరినవారియొక్క సహవాసము ప్రాణాయామాభ్యాసపరులకు ప్రాణాయామాభ్యాసమందు అనుభవ నీయుల స్నేహము, విచారణాభ్యాసులకు విచారణయందు ఆరూఢుల చెలిమియున్నూ, మనోలయాభ్యాసకులకు అమనస్కస్థిత్యనుభవపరుల స్నేహమున్నూ చేయుటే సత్సహవాసము. విచారణాభ్యాసులకు యోగుల స్నేహముగాని, అమనస్కులకు బాహ్యాభక్తుల స్నేహముగాని కుదరదు. కుదిరినా దానివల్ల వారివారి అభ్యాసాదులు అభివృద్ధి కాకపోగా అధోగతికికూడా వుభయులకూ కలుగుటకు సందేహములేదు. ఇట్టిదే దుస్సాంగత్యమనవలెను. ఇక విషయలోలులస్నేహము సంసారనిమగ్నుల స్నేహముగాని ఎంత అనర్థకమునుకలిగించునో చెప్పనక్కరలేదు

అట్టివారినుంచి ఎంతెంతదూరము పోగలిగిన అంతంత దూరమునచేరుటకు మనం ప్రయత్నించుటే మనవిధి. ముముక్షువులకు అవశ్యకర్తవ్యము యిదియొకటిమాత్రమే. "సత్సంగత్వే నిస్సంగత్వ" మనునది యిదిమాత్రమే. దీనిని అశ్రద్ధచేసిన యడల పతనమగుటకు ఏమీా సందేహములేదు. కర్మలంపటుల స్నేహము మోక్షాభ్యాసకులకు పాలకు, విషము విరుగుడైనట్లు మోక్షధర్మములకు విరుగుడని తెలియవలెను. యేసహవాసము చేయవలెనో తెలుసుకొనుటకు అప్పటికప్పుడే ఇంద్రియ మన శ్శరీరాదులకు కామక్రోధలోభ మదోద్రేకములు ఆరోగ్యాది సాధనములకు ఎంతెంతభంగముకలుగుచు ఉద్రేకములు కలుగు

చున్నవో చూచుకొనుచూ తీవ్రముగా ఆలోచించిన యడల యెవరెకివారు తెలుసుకొనుచూ స్నేహము చేయుచుండవలెను. అట్టి మంచిగుణములను వృద్ధిచేయు స్నేహితులుదొరకనియడల తన అభ్యాసములు మాత్రము తాను చేసుకొనుచునైననూ కాలము గడుపవలెనుగాని యేదోయొక స్నేహమని అశ్రద్ధతో స్నేహించినయడల వెంటనే పతనమగుదురనుట అనుభవసిద్ధము

10 హంసపరీక్ష : ప్రతి నిముషము హంసను అనగా శ్వాసను లెక్కచూచుకొనుచూ జంటస్వరములు ఆడుచున్నవో ఒకేస్వరము అనగా ఒక ముక్కు వెంటనే గాలి వదలినపుడువచ్చు చున్నదో చూచుకొనుచుండవలెను. ఒక్కొక్కనాడి ఎంత కాలము ఆడుచున్నదో, ఏస్వరం ఆడుచున్నపుడు ఎట్టివృత్తులు కలుగుచున్నవో కనిపెట్టుచుండవలెను. వ్యవహారములోనుండగా కూడా అప్పుడప్పుడు గంటకు ఎన్ని హంసలు అగుచున్నవో ప్రతి శ్వాసకు ఎన్ని మంత్రములు అనేవరకు శ్వాస వుండుచున్నదో కనుగొనుచూ వుండవలెను. మనోలయానందానుభవముగల జ్ఞానికి ఎల్లప్పుడూ సాధారణముగా జంటస్వరములేఆడుచుండును ఏవైనా మలినాదులు చుట్టుకొన్నప్పుడుమాత్రం జంటస్వరాలు లేకపోగా ఒకస్వరమైనా ఎక్కువకాలం ఆడకపోవుట అనగా హంసలుఎక్కువగా వదలవలసివచ్చును. దీనినిబట్టి జ్ఞానాభివృద్ధిని తెలుసుకొనగలము. అనగా రెండు ముక్కులనుంచి శ్వాసవదలి నపుడు గాలి సమముగావచ్చుట, హంస అనగా శ్వాసలు తగ్గి ఆడుట ఇవి జ్ఞానానుభవమునకు గుర్తులు. సుషుమ్నచలనము అప్పుడప్పుడు కలుగును. అనగా వెన్నుపూసలలోని నరము సుషుమ్న అది కదులుచుండును. శరీరమంతటవున్న జ్ఞాన

నాడులుఅదురుచుండును. జంటస్వరములుసమముగను, సమాన దూరముగను శ్వాస గాలి వచ్చుచూ పోవుచుండును. లేదా స్వరూపనిష్టగలిగిన సమయములలోకూడా, జంటస్వరాలు ఆడక పోయినా కుడినాడి ఎక్కువకాలం ఆడుచుండును. ఇది ఆడినపు డెల్లా మంచివృత్తులే కలుగుచుండును. ఎడమస్వరం ఆడినపు డెల్లా ప్రాపంచికవిషయములే కలుగుచుండును. జంటస్వరములు ఆడుచున్నప్పుడెల్లా నిర్విషయాకారవృత్తి మనసుకు కలుగు చుండును. ఇవి అభ్యాసకులకుమాత్రం ఆరూఢులకుకూడా స్వభావముగానేవుండును. ప్రతి శ్వాసయూ మూలాధారము నుంచి సహస్రారమువరకు అనగా బ్రహ్మకపాలంవరకువచ్చుచూ పోవుచుండును. ప్రతిశ్వాసకు నివృత్త్యనుభవము పొందుచుండును అది జ్ఞానిగుర్తించుచుండును. అజ్ఞానికేన్ని కలిగినా గుర్తించలేక పోవును.

ప్రతి శ్వాసనూ మూలాధారమునుంచి సహస్రారము వరకుపోయి తిరిగి మూలాధారమునకు చేరునట్లు ప్రయత్న పూర్వకముగా చేయుచుండవలెను. అందువల్ల హంస తగ్గును. ఆరోగ్యము వృద్ధిఅగును. ఆయుస్సు క్షీణింపక వృద్ధిఅగును. ప్రతిహంసకూ స్వరూపానుభవము కలుగుటయూ తటస్థించును. ఇది అన్నిపనులలోనూ చేయనగును. ఆరోగ్యసాధనకుచేయు ధర్మములలో యిది మిక్కిలి ప్రధానము. సహస్రారమందు ఏదో ఒకవస్తువ తగిలినట్లు స్పర్శ కలుగును. ఒక్కొక్కప్పుడు టిక్కు టిక్కుమను శబ్దముకలుగును. మాడున, మాడు మెత్తగా పసి పిల్లల మాడువలె మృదుత్వముగనుండును. హంసను, మనసును, సహస్రారమందు ధారణ ఎక్కువగాచేయుటచే యిట్లుకలుగును. అదితగ్గగానే యథాస్థితికివచ్చును. ప్రతిశ్వాసకుపీల్చునపుడు "సో"

అని వదలునపుడు "హం" అని అన్నట్లు మనసుతో అనుచున్నట్లు భావించుచూ నడుపుటే "సోహం" అను మంత్రజపమనెదరు. ఇది ఎల్లప్పుడు ఆజన్మాంతరము తనకుతానే జరుగును. దీనినే అజపగాయిత్రిఅందురు. ఇందులో చెప్పిన ప్రతిఅభ్యాసము చేయునప్పుడెల్లా హంసమంత్రమునుగూర్చియే చేయుచుండవలెను. ఇది ఎన్నటికి మరువరాదు. ప్రతి హంసకు పూరించునపుడు "సో" అని మనసునపలుకుచు శక్తికొలది కుంభించి అనగా శ్వాసను ఆపి "హం" అని మనసునపలుకుచు విడుచుచున్నయెడల అన్ని అభ్యాసములుచేసిన అనుభవములన్నియూ కలుగును. కొన్ని సంకల్పశిద్ధులుకూడా కలుగగలవు. ఇది చేయుచున్నయెడల వేరే యితర అభ్యాసములు చేయనక్కరలేదు. దీనికే "సోహామను మంత్రార్థవిదుల విదేహాము క్తియె రామనామం" అనెదరు. ప్రయత్నపూర్వకముగా పట్టుదలతో చేయవలెననే వుద్దేశ్యము కలిగిననేగాని యిది నెరవేరదు. గంటకు 900 అయ్యే హంసలు ఇది చేయుచున్నవారలకు 200 శ్వాసలువరకు చేయగలరు. క్రమేపి తగ్గుచుండును. హంసతగ్గుట శరీరారోగ్యమునకు, మనో నిగ్రహముకొరకు, లోక వ్యవహారములు నెరవేర్చుకొనుటకు, ఆయుర్వృద్ధికి అత్యాంత అవుసరము. లోక వ్యవహారములు చేయుటకు యేమియూ అడ్డములేదు. ఏకాంతస్థలమున నిత్యము కూర్చుని మొదట గంటసేపుచొప్పున రోజుకు 4 సార్లు చేయుచున్నయడల కొద్దిరోజులలో గొప్పగొప్పఅనుభవములు అనగా మనోనిర్మలత్వము, మోక్షానుభవము (నిత్య, నిరూపాధికానందానుభవము) అఖండాత్మైక్యానుభవము కలిగినట్లు ఎవరికి వారికే తెలియనగును. దీనిద్వారా ఎక్కువకాలము శ్వాసను సహాస్రరమందు బ్రహ్మరంధ్రస్థానముననిల్పి నిస్పృహాత్మస్థితిని

చూచుకొనుచూ ఇంద్రియ వ్యాపారాదులలోకూడా నిత్యానందమోక్షమును సహజామనస్క రాజయోగస్థానమును సులభముగా పొందనగును. గాని దేనినైననూ సక్రమముగా వేళ తప్పకుండా క్రమాభివృద్ధితో నెరవేర్చి సద్వినియోగపరుచుకొనుటకు అలవాటు చేసుకొనుచుండినయడల అత్యంతానందమును చేకూర్చునుగాని ఒకరోజునచేసి ఆలస్యాది దోషములచేతను, సోమరితనముచేతను బద్ధకించి దుస్సహవాసము మొదలైన దోషములచేత పదిరోజులుమాని పదిరోజులుచేసి మధ్యమధ్య కొన్నిరోజులుమాని గ్రంథములో చెప్పిన ఫలములు కలుగలేదే అతిశయోక్తులని, అనుభవరహితములని, శుష్కవేదాంతములని గ్రంథకర్తను నిందించుట నిరుత్సాహము కలుగుటకు హేతువులగును గనుక యీ గ్రంథములో చెప్పిన అంశములను జాగ్రతగా పరిశీలించి శక్తికొలది ఏమాత్రం ఆచరణలో పెట్టినా చేసినంతకు కలుగవలసిన అనుభవములు కలిగితీరును. గ్రంథములోని అంశములు తెలియనియడల బాగుగా ఆంతరంగికదృష్టిలో విచారించి తెలుసుకొని ఆచరించప్రయత్నించవలెను. ఈ సంఘములో ప్రవేశించనివారలుకూడా ఒక్కొక్క విషయమును శక్తికొలది వ్రాసినవిధముగా కొద్దికొద్దిగా చేయుచున్నయడల వృద్ధిక్రమేపి కలిగితీరుననుట నిస్సందేహము. సంఘములో ప్రవేశించినవారలకు నిత్యము ఒక్క అంశమునైనా వ్రతముగా చదువుచుండినంతమాత్రముననే సద్యోమోక్షముఅనగా అప్పటికప్పుడే జన్మరహితత్వస్థితియూ సర్వాభీష్ట ఫలప్రదమును చేకూరుననుటకు స్వానుభవైకవేద్యమేనని సంఘసభ్యులుకూడా చెప్పగలిగిరి.

—o—

# గ్రంథకర్త క్లుప్త చరిత్ర.

వీరిపేరు పెదప్రోలు శేషయ్యగారు. సర్వజితునామ సంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశి అనగా నరసింహజయంతిరోజున పెదప్రోలు అయ్యపరాజుగారికి జననమందిరి. తల్లిపేరు శీతమ్మ గారు. జనన మందినప్పుడు తల్లిగారికి గొప్ప సర్పము కండ్లకు కన్పించినందువ వీరికి ఆదిశేషుఅని నామకరణమొనర్చిరి. గాని రానురాను శేషయ్యఅనిమాత్రం పిలువబడుచుండిరి. తండ్రి గారే విద్యాభ్యాసము చేయగడంగిరి. కొంతవిద్య వీరి పినతండ్రి గారైన పెదప్రోలు శీతయ్యగారు 12 సంవత్సరముల వయసు వచ్చువరకు బాల రామాయణము, కృష్ణ శతకము, గజేంద్ర మోక్షము మొదలగు శతకములు పది చదివించిరి. గాని అర్థ జ్ఞానము చెప్పినవారికే తెలియకపోవుటచేత వీరికి కలుగలేదుగాని అర్థంలేనిచదువు వ్యర్థమనే అభిప్రాయం ఎల్లప్పుడు వేధించు చున్నందున తండ్రిగారిని అప్పుడప్పుడు ప్రార్థించుచున్ననూ తెలియదను జవాబుమాత్రం చెప్పుచుండిరి. గాని అంతటితో తృప్తిజెందక తెలుసుకోవలెననే వుద్దేశము వేధించుచునే యుండెను. అప్పటికి ఆవీధిబండ్లలోనిచదువు లెక్క మొదలైనవి పూర్తిఅయ్యెను. గాని అర్థం తెలియగల శక్తినిచ్చు విద్యయూ ఇంగ్లీషునేర్చుకొనవలెననేకోరిక మరింతతీవ్రమయ్యెను. ఇంతలో ఉపనయనముచేసిరి. అక్కడక్కడ ఇంగ్లీషుమాటలు మొదలైనవి కష్టించి నేర్చుకొనెను. ఇప్పటివలె అప్పుడు స్కూళ్ళు ఎక్కువగా లేవు. తలితండ్రులు ఇంగ్లీషునేర్పించుటకుశక్తిలేనందున చెప్పించ నుద్దేశములేదు. అందువలన తనకోరికను నెరవేర్చుకొనుటకు ఆ చిన్న వయసులోనే అవనిగడ్డ లేచివెళ్ళి 4 వ, తరగతిలోచేరి

ఆ తరగతి గవర్నమెంటుపరీక్షలో వృత్తీర్ణుడయ్యెను. ఆ
వయస్సువరకు 8 సం॥ రముల వయస్సునుంచి భక్తిలో, బాల్య
దశలో పుల్లలతో చిన్నచిన్నగుళ్ళుకట్టి పిల్లలతో భజనలు
చేయుట, రాములవారి పటములకు పూలదండలు, తులసిమాల
లతో అలంకరించి, ధూపదీపనైవేద్యములు సమర్పించి తగు
పిల్లలతో భక్తి పరవశతానుభవమును పొందుచుండెడివారు.

ఇట్లుండగా ఒకానొక సం॥ రమున పూర్ణచంద్రగ్రహ
ణము పట్టగా తనంతటతాను, పట్టుస్నానముచేసి, జపమునకు
కూర్చొని, తారకమంత్రమును జపించుచుండగా పెద్ద వరద
వచ్చి అవనిగడ్డఅంతయు మునిగెను. అప్పటికి శీతారాములు
ప్రత్యక్షమై చేయవలసిన ధారణాదుల అనుభవమును వారివల్ల
బోధింపబడుచుండెను. వెంటనేలేచి సామగ్రిఅంతయూ చెరువు
గట్టుముందే యున్నందున చేర్చి ఆ రోజులలో అన్నవస్త్రము
లకు ఎంత లక్షాధికారులైన బాధపడుసమయములో అన్నవస్త్ర
ములు పూర్ణముగా కలిగినందున ఆమంత్రముయొక్క ప్రభావము
వల్లనే తనకు అంత కష్టసమయములోకూడా అంతసుఖము కలి
గించినందులకు భక్తి అతిశయమై ప్రతిరోజు జపంచేయుచూ
కాలము గడుపుచుండెను. అప్పటినుంచి తనకు ఇహాలోకసుఖము
లన్నియూ భగవదనుగ్రహమువల్లనే కలుగుచున్నట్లు భావనా
రూఢమైనందున అనన్యభక్తి, ఏకాంతభక్తి, నిశ్చలభక్తి కలు
గుటకు మార్గమయ్యెను.

తన అంతరాత్మయందు అనేకరకములగు క్రొత్తక్రొత్త
విషయములు ప్రశ్నించుకొని జవాబులు పూర్వపక్షసిద్ధాంతా
దులతో తెలుసుకొనగలుగుచుండెను. దీనికితోడు క్లాసులలో

జరుగు పాఠములలోగల నీతిబోధదాయకములగు పద్య, గద్య కథారూపములోగల విషయముల అమలులోపెట్టుకొనుచు నీతి ప్రవర్తనతో భగవంతుని సాకారరూపము రాముడేఅను నమ్మకముకలిగి కాలముగడుపుచుండగా గవర్నమెంటుపరీక్షలో 4 వ తరగతి ఇంగ్లీషులో ఉత్తీర్ణుడైనట్లు తెలిసెను. ఇదియునూ తన భక్తికి సత్ప్రవర్తనకు మరింత ప్రోత్సాహము కలుగచేసెను. భగవంతునివల్లనే యిహలోక, పరలోక సుఖములు యిక్కడే కలుగుచుండునను నమ్మకము మరింత వృద్ధిఅగుచుండెను. ఇంకా ఇంగ్లీషు చదువవలెననే నెపముతో బందరువెళ్ళి అక్కడకొందరి సత్పురుషులుసహాయముతో వారములు కుదుర్చుకొని 1 వ ఫారములో ప్రవేశించి చదువుకొనుచూ సత్పురుషుల స్నేహముతో భాగవతాదిగ్రంథములు చదువుచూ వాటి అర్థములు తెలుసుకొనుచూ ఒక్క విష్ణుమూర్తియే మోక్షప్రదాతయని నమ్మి కష్టనష్టములకోర్చి కొన్ని నియతులతో కాలముగడుపుచుండగా 3 వ ఫారంప్యాసై చదువుకొనుచుండెను.

4వ ఫారంలో ప్రవేశించగానే సహాయముచేయుస్నేహితులు బదిలీ అయినందుననూ, వైరాగ్యము హెచ్చినందుననూ పొట్టకూటివిద్య యింతటితోచాలుననే నిరాశ అభివృద్ధికాజొచ్చినందుననూ అసలు మొదటినుంచియూ యితరులను అడుగుట అంటే చాలాసిగ్గు, లజ్జ అభిమానాదులుగలవారగుటచేత వారములుగాని, డబ్బుగానిలేక చాలాకష్టమై చదువు చాలించెను. స్కూల్ మేష్టరుగా చేరవలెననేవుద్దేశము కలిగెను. అప్పటికాలములో యితర డిపార్టుమెంటులలోకూడా వుద్యోగములుదొరుకుచుండెనుగాని భగవద్భక్తి అభివృద్ధిచేసుకొనుటకు స్కూల్

టీచరుగావుంటేనే విశ్రాంతి మొదలైనవి కలుగగలవని వివేక దృష్టిచేత తెలుసుకొని ప్రయత్నించగా మల్లవోలుస్కూల్‌లో హెడ్‌మాష్టరుగా మొదటనే నియమించిరి. అప్పటికే నరసింహోపాసకులయొక్క అనుభవములు చదువుకొను చున్నప్పుడే వుద్భవించెను. అవేవనగా నరసింహామూర్తియొక్క కథలు, పద్యములు చదువునపుడున్నూ, ఆరూపమును దర్శించు నపుడున్నూ గగుర్పొందుట, పుష్పాంగి శ్వాస పూరించి కుంభ కమున కొంతకాలము నిల్పుట, నిశ్చేష్టత్వము, భవిష్యత్తులు కనుగొనుట, కొన్నిశక్తులు కలుగుట మొదలైన అనుభవములు కలుగుచుండెను.

అందులో ఆయా వికారములను వదలి నిస్పృహత్వము, చిత్తైకాగ్రత, ఇంద్రియనిగ్రహము, వాయు నిరోధము, వూర్ధ్వ దృష్టి, సూక్ష్మదృష్టి మొదలగు గుణాతీతలక్షణములనుమాత్రము వద్దిలోకి వచ్చేటట్లు లక్ష్యమందుంచుకొని వాటినిఅభివృద్ధి కలుగ చేయు అభ్యాసములను మాత్రము నిలుపుకొను నడతను మాత్రము అభ్యసించుచుంవుట నియతిగా ఏర్పరచుకొను చుండెను. ఇట్లుండగా గుంటూరులో ట్రైనింగుఅగుటకు వెళ్ళి నప్పుడు అక్కడ యోగసాధన చేయుచూ మోక్షానందానుభవ నీయులున్నూ, కారణగురువులరగు ప్రియాగ పురుషోత్త మాచార్యులవల్ల ఒకమంత్రముపదేశింపబడి వాయునిరోధా భ్యాసము ఆ మంత్రాధారముతో చేయుటయూ, సీతా రామాంజనేయము, మహాభక్తవిజయము, భగవద్గీతాది గ్రంథ ములు గురువుగారివల్ల విచారణచేయుచూ కాలముగడిపి ట్రైనింగు ప్యాసుకాగానే స్వగ్రామమైన పెదప్రోలుకే మేష్ట

రుగా నియమింపబడితిని. ఉపాధ్యాయవృత్తిని చేసుకొనుచూ నియామకములతో ప్రాణాయామాభ్యాసములను నిర్వర్తించుకొనుచూవుండగా కొందరు ముముక్షువులు మోక్షార్థులై నన్నాశ్రయించుచుండిరి.

నరసింహోపాసనాబలముచేత కొన్నిశక్తులు కలుగుచుండెను. ఆ శక్తులనుచూచి కొందరు ఆశ్చర్యపడుచుండిరి. ఆ శక్తులన్నియూ అసత్యములని మోక్షము ఒకటిమాత్రమే సత్యమని నమ్ముచుండెను. నలుగురనుమాత్రము శిష్యులుగా వుండుటకు అంగీకరించి మొదట భక్తవిజయం, భాగవతాది గ్రంథకాలక్షేపణచేయుచూ విష్ణోపాసనాది అభ్యాసములు చేయించుచుండెను. ముఖ్యముగా సత్ప్రవర్తనయూ, ఏకదైవోపాసనయూ ఆహారనియతియు (మాంసాహారము విసర్జించవలెను) మాత్రము ఆచరింప చేయించుటే విధులు. ఉద్యోగమునకు వచ్చునప్పటికి వారి సంసారములో అన్నవస్త్రాదులకుకూడా జరుగుబాటులేక కష్టములు పడుచుండిరి. అందువల్ల ప్రైవేటు పిల్లలకు విద్యనేర్పి జీతముగాక సంపాదించవలసిన అవుసరము గలిగెను. తలి, తండ్రులను అన్నవస్త్రములలో ఏ లోపము లేకుండా కాపాడుచు వివాహాదులు తాను సంపాదించినద్రవ్యముతో సంసారమునకు ఖర్చుపెట్టుచూ ఆడంబరహీత జీవనము చేయుచూ లౌకికరముల మెట్టపొలమమాత్రము తలితండ్రులిచ్చిరి.

వీరి భార్యకూడా సద్గుణవతియై ముళ్ళపూడివారు రాజామణమ్మఅనే పేరుతో వివాహము అయినదిమొదలుకొని భక్తి, జ్ఞాన, యోగాది సాధనములు చేయుచూవచ్చెను. భర్తగారి

ఆజ్ఞానుసారం వశవర్తినియై కాలోచితముగా ద్రవ్యము వెచ్చించుచూ కంటికిరెప్పవలె అన్నివిధములా సంసారమును గడుపుచుండెను. భర్తతోపాటుగా ఆత్మశక్తులుగలిగి సంకల్ప సిద్ధులు, రోగములను మందులేకనే నయముచేయుట, తనకు, యితరులకు సహాయముచేయుచూ ప్రాపంచిక కార్యములలో ఏమరుబాటులేక అప్రమత్తతతో కాలముగడుపుచుండిరి. ఇప్ప టికి నలుగురు మగపిల్లలు 5 గురు ఆడపిల్లలుకలిగిరి. మగపిల్లలకు ముగ్గిరికి స్కూల్ ఫైనల్ వరకు చదువుచెప్పించెను. వార్లకుద్యోగ మిప్పించెను. ఆడపిల్లలందరికి వివాహాదులుచేసిరి. కొద్దిజీతములో సంసారముగడుపుకొని, వివాహాదికార్యములుచేసి, పెంకుటిల్లు కట్టించి, 5 యకరములమాగాణిభూమిని సంపాదించి ఇహ పర లోకములలోఏకొరతయులేనిజీవితమునుగలిగిఆదర్శప్రాయులుగా భార్యాభర్తలు లోకోద్ధారణమునకు పాటుపడుచు నిరంతరము రాజయోగమునుబూని ఆనందామృతమును గ్రోలుచు జీవిత మును గడుపుచున్నారు. ఇది అంతయూ ఎందుకు చెప్పవలసి వచ్చెననగా భక్తులకు భగవదనుగ్రహమువల్ల ఇహ పర లోక ములలో ఏ కొరతయూలేకుండా సమస్తసుఖములు కలిగించి నిత్యానందమోక్షముతో జీవన్ముక్తిని పొందింపచేయుననుట స్థిరమని నమ్ముటకు వ్రాస్తిని. గాని సత్ప్రవర్తన భక్త్యాదులులేని మానవులకుకూడా ఇహలోకములో అష్టైశ్వర్యాదులు కలిగి యుండుటలేదా? భక్తులకంటెను ఎక్కువగానే ఇహలోకవిష యానందానుభవములు కలుగుచుండుటమనము చూచుచుంటిమి గాని. ఆ విషయానందానుభవములు వున్ననూ ఆ అజ్ఞానులకు సుఖము అనుభవించుచున్నాను. నాకేకొరతయూ లేదనే

కృతజ్ఞతాస్తుతియొక్క సంతుష్టైనా లేకపోగా అది అంతయూ దుఃఖములుగానే శోచుచున్ననూ వాటినుండి తప్పించుకొను వుపాయము దొరకక మరింతదుఃఖములను కల్పించుకొని వ్యధలే అనుభవించుచున్నట్లు మనము ప్రపంచికములో విచారించిన కొలది తోచకమానదు. ప్రతి యిహలోక విషయసుఖములను గాని ప్రతి పరలోక విషయానందానుభవములనుగాని భగవంతుని వల్లనే కలుగుచున్నవనే అభిమానించుటయూ తన పురోభివృద్ధికి ఒక మార్గమేనని వీరి ముఖ్యాభిప్రాయము. 4 వ తరగతి చదువునప్పుడు ఒకానొకరోజున పెదప్రోలునుంచి అవనిగడ్డకు వెళ్ళుచుండగా దారిలో కృష్ణానదిదాటి వెళ్ళవలసి యుండెను. దిగవలసినచోటు తెలియక గుణ్ణమునకు సూటిగాదిగి వెళ్ళుచుండగా కంఠంలోతువచ్చినాదిగుచుండగా ఒకమనుష్యుని వలెవచ్చి అది గుణ్ణము. ప్రక్కకుతప్పుకొని నడవమనగా ఒడ్డుకు చేరగలిగితిని. గాని యింతలోనేను ఒడ్డుకుచేరి చూడగా ఆ మనిషి మాయమయ్యెను. కేవలం భగవంతుడే అట్లువచ్చెనని నమ్మెను. ఇట్లే మరియొకప్పుడు మల్లవోలునుంచి పెదప్రోలు వచ్చునప్పుడు రాత్రివేళ నీటిలోదిగి దారితెలియక మునుగుటకు సిద్ధమైయుండగా మనిషివలెవచ్చి దారిచూపి గట్టెక్కించి ఆ మానవుడు అంతర్థానమగుటయూ ఆ శ్రీరామమూర్తియని మరింతభక్తి అతిశయించుటకు మార్గమయ్యెను. యిట్లు అనేక సార్లు నీటిగండములను తప్పించుటజరిగెను. అనేక సంకల్ప సిద్ధులు కలిగెననుట దృష్టాంతములుగలవు. 4 గురు స్నేహితులతో అవనిగడ్డ వెళ్ళుచుండగా దారిలో ఒక మామిడితోటలో ఎండకు చెట్టుకిందనేను స్నేహితులతోకూర్చొని ఒక మామిడి

కాయ దొరుకునేమో చూడమని ఆ స్నేహితులకు చెప్పగా వారు చెట్లన్నియూ గాలించిననూ ఒక కాయయైనా దొరకక దయ్యెను. అప్పుడు నేను వెతకివెతకి వేసారెను. అది కాయలు లేనికాలము. అదిగాక ఆచెట్లు దారిలో వుండెను. ఆచెట్లు ఎన్నడూ కాయను ఒక చిన్న చెట్టువద్దకురాగానే ముఖమునకు ఎదుటే ఒక పెద్దపండు వ్రేలాడుచుండెను. దానిని ఆ స్నేహితులకుచూపి కోయగా కోసినకొమ్మకూడా తొడిమైనాకన్పించక మాయమయ్యెను. అప్పుడా కాయనుకోసి ముక్కలు ఆ స్నేహితులకు పెట్టి ఎన్నితిన్నా తరుగక చాలాముక్కలుకాగా దేవుడిచ్చిన మామిడిపండని యింటివద్దకుకూడా తెచ్చి కుటుంబములోనివారికి కూడా పెట్టి ఆ టెంకను పదిలముగా మొక్క మొలిపించవలెనని ప్రయత్నించెనుగాని మొలవలేదు. పెంకుటిల్లు కట్టునపుడు గోడలు మట్టివి తయారైనసమయములో వానకు తయారైన గోడలు పడిపోవుటకు సిద్ధముగానుండగా అపరిమితమైన మబ్బు వాన పట్టుచుండెను. ఆవూరిలో వాన కురవరాదనిసంకల్పించగా చుట్టుపక్కల మైలుదూరములో అనేకదుక్కులువాన కురియుచుండెను. గాని వెదప్రోలులోమాత్రం ఒక్కచినుకైనా పడేది కాదు. పెంకునేత తయారైనతర్వాత వెంటనే అపరిమితమైన వాన కురిసెను. ఇది అందరికిన్నీ బాహాటముగా కన్పించెను. యిదియూ భగవదనుగ్రహమువల్ల కలిగినశక్తివల్లనే సంకల్పసిద్ధి అయ్యెనని మరింతభక్తి అభివృద్ధిఅగుటకు వుల్లాసముకలిగెను ఇందువల్ల అహంభావత్వము, గర్వము మొదలైనదుర్గుణములు కలుగునేమోనని అహంకారదమనమునకు ఆ శక్తులవంక తలంపునైననుపోనీయక భగవంతునిరూపములో తన్మయత్వావస్థను

పొందుచూ నిరంతర ప్రాణాయామాద్యభ్యాసములను విడువక సద్గుణసంపదను అభివృద్ధి పరుచుకొనుచుండెను. ధన, ధాన్యాదులు నిలువలేకనే తనపెండ్లి, పెంకుటిల్లుకట్టుట, పొలములు కొనుటయూ మొదలిడగా ఆ ఋణాదులవల్ల భగవదనుభవశక్తిగాని సంకల్పసిద్ధుల మహాత్మ్యముగాని లేనియెడల ఆ ఋణాదులవల్ల యెంతయో అనర్థములుకలుగు సమయమాసన్నమయ్యెనని తన దాయాదులుచూచి సంతోషించుచుండగా నాలుగు వైపులనుంచి అనేకవిధముల లక్షాధికారులు తమ పిల్లలకు ప్రైవేట్లు చెప్పించుకొనుటకు తమను వినయ భయభక్తులతో ఆశ్రయించి సంవత్సరం ప్రైవేటుజీతము ముందే యిచ్చుటకు వారికి బుద్ధియిచ్చుటవల్లనూ, దసరాపండుగలకు అనుకొన్నదానికంటె ఎక్కువడబ్బు యివ్వవలెనని ఆయావ్యక్తులకు బుద్ధిపుట్టియూ, గ్రాంట్లు మున్నగునవి ఎక్కువగా వచ్చుటయూ మొదలైన సన్మార్గాదులవల్ల ఆ ఋణాదులు వెంటవెంటనేతీర్చినందున తనను హేళన పరాభవాదులుచేసి సంతోషించవలెనని కుతూహలపడుచున్న దాయాదులయొక్కకోర్కె నెరవేరక పోగా వారందరూ తనకు భక్తులై మోక్షకాంక్షగలవారైరి. కొందరు బాహాటముగా తనవద్దకువచ్చి మోక్షముకలిగించుటకు ఆశ్రయించిరి. గాని అభ్యాసాదులు చేయలేక కడతేరలేకపోయిరి గాని త్రికరణశుద్ధిగా ఆశ్రయించినవార్లకు అడ్డు చెప్పకయే తెలిసినంతలో ప్రయత్నించుచుండిరి. వారివారి నిష్కల్మష ప్రేమాస్పద భక్తులైనవార్లుమాత్రము కడతేరగలిగిరి. 55 సంవత్సరములు వచ్చువరకు బోర్డులో పనిచేసినంతకాలమూ సంఘము అభివృద్ధిలోకి తేవలెననేవుద్దేశము లేనందున ఆశ్ర

యించినవారలనైననూ ఉపదేశముచేసి సంఘములో చేర్చు కొనకుండిరి. ఉపాధ్యాయపదవిలోకూడా అధికారులదగ్గరనుంచి పామరజనులవరకు వీరియొక్క విద్యాబోధనాసామర్థ్యమును వేనోళ్ళ కొనియాడుచుండెడివారు. అట్లే పరవిద్యయందుకూడా సులభమోక్షసూక్ష్మధర్మములు ఆచరించి, చూపి, బోధించి, ఆచరింపచేయుటను చూచి ఆబాలగోపాలము ఆశ్చర్యాతి శయములతో ఆదరానుభవములను ప్రోత్సాహింప, బోధింప సామర్థ్యము కలిగియుండిరి. ఇతరగురువులకు వీరికిగల తారతమ్య ములు, వీరి నడతలో నియామకములోను పండిత పామరులకు హస్తియశకాంతములుగా కానవచ్చుచుండెను. దీనికంతకూ కారణము భార్యయైన రాజామణమ్మగారి సుగుణసంపదయే బంగారమునకు తావి అబ్బినట్లు వీరుఅసలే బంగారమువంటివారు ఆమెకూడా సుగుణమణిగనుక సువాసన బంగారమునకు అబ్బితే దానిఘనత గొప్పదైనట్లు వీరికి నిరతిశయానందము వృద్ధి కాజొచ్చెను. వీరికంటెను ఆమెకు శక్తులు తాత్కాలికముగా చేసి ముగింపగల సామర్థ్యము యినుమడింపజొచ్చెను. చల్లపల్లి గ్రామములో, తమస్వగృహములోనివసించుచుండగా సంఘము అభివృద్ధికి తేవలెననేవుద్దేశము కలుగగానే పరమాత్మకు సృష్టి స్థితిలయములు చేయవలెననేవృత్తి కలుగగానే నామరూపాదు లతోగూడిన యీ మనముచూచు ప్రపంచకము పుద్భవించినట్లు అనేకమంది సత్పురుషులు లోగడవీరు నీరుగలిసినవిప్పుమాదిరిగా గుహ్యముగా మోక్షార్థులైన పతివ్రతాశిరోమణులున్నూ వారి వారికర్మ పరిపాకదశయైనట్లు ఒక్కొక్కరే తియ్యనీరుకు చేపలెక్కి నట్లు భక్తులు సంఘములోచేరిరి. సులభ రాజయోగసమాధిని స్వభావముగా అనుభవించగలిగిన, మహాశక్తివంతులైన స్త్రీ,

పురుషాదులు జాతిమత ఆశ్రమాది విచారణలేకయే కోరిన వారలకు నిశ్చలులై, నిర్మలులై పవిత్రనీయులుగావుండ నిశ్చయించుకొన్న ముముక్షువులను భక్తులుగాచేర్చుకొన ప్రియత్నించి సంఘాభివృద్ధిచేయ మొదలిడిరి. ఇప్పటికిసృష్టిలో దంపతులిద్దరు సరిసమానమైన భక్తి, జ్ఞాన యోగానందానుభవమును అనుభవించుటలో ఆరితేరిన "స్వయంతీర్ణః పరంతారయతి" అను ఆర్యోక్తికితగినట్లు ఆదర్శప్రాయములగు నిష్టలను తాము ఆచరించుచూ యితరులను ఆచరింపచేయుటలో వీరిని మించిన వారుగాని, సరిసమానులుగాని లేరనియేచెప్పట అతిశయోక్తి కాదని ఈర్ష్యాసూయాదులులేని మహనీయులందరికి సుస్పష్టముగా విదితమగుచుండగా అతిశయోక్తి అననేల, చూచి పరీక్షించినవారలకు అప్పుడప్పుడే వీరిమహత్తులు గోచరింపకపోవు ఇప్పటికి వారికి 68 సం॥ రములు గడిచిననూ ఆత్మశక్తివల్లనే శరీరారోగ్యాదులు, తేజస్వంతమైన ముఖవికాసము దయార్ధ్రిహృదయమైనట్లు గోచరించు రూపురేఖ విలాసాదులుగలిగి ప్రవర్తించుచున్నారు. వీరికంటె దేవిగారికంటె ఎక్కువగా నున్నవా? అన్నట్లు వీరి ఛాయాపటమును విమర్శించుచూ దర్శించు పండిత పామర జనులకు గోచరించుటయే దృష్టాంతమని చెప్పవలెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ఓం తత్ సత్.

శ్లో॥ మంగళం భగవాన్విష్ణు, మంగళం మధుసూదన,
మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజా, నీలాచల
నివాసాయ నిత్యాయ పరమాత్మనే, సుభద్రి ప్రాణ
నాథాయ శ్రీ జగన్నాథాయ మంగళం॥

పంచ భూతములు : భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము.
దశేంద్రియములు : జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5
త్వగింద్రియము : తాకి తెలుసుకొనే అవయవము తోలు.
చక్షురింద్రియము : కన్ను, ఇది రూపములను గ్రహించును.
శ్రోత్రేంద్రియము : చెవులు, ఇవి శబ్దమును వినును.
జిహ్వేంద్రియము : నాలుక, ఇది రుచిని గ్రహించును.
ఘ్రాణేంద్రియము : ముక్కు, ఇది వాసన చూచును.
కర్మేంద్రియములు : వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ.
అంతఃకరణచతుష్టయం : మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము.

మనసు : విషయములమీదికి పోవుచుండును, సంకల్పించుచుండును.

బుద్ధి : స్థిరపరుచును.
చిత్తము : ఎల్లప్పుడు కదలుచుండును.
అహంకారము : నాఅంతవాడులేడని గర్వించుచుండును.
పంచకోశములు : అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ.
3 శరీరములు : స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరం.
3 అవస్థలు : జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ.

ఈ పుస్తకం పుచ్చుకున్న ప్రతివారు ప్రతిరోజు 1 విషయమైనా బాగా మననంచేసి చదివితీరవలెను అని వ్రతము పట్టవలెను. ఆ వ్రతంప్రకారం చేయవలెను.

గుణములు : 1 సత్వగుణము 2 రజోగుణము 3 తమోగుణము

1 సత్వగుణం : భగవంతుని జేరుటకు చేయుపనులు.